## సంపాదకుని మాట

ఆంధ్ర దేశంలో అత్యున్నత గౌరవం పొందిన ప్రముఖులలో శ్రీ బులుసు వేంకటేశ్వర్లు గారు ఒకరు. వేద, వేదాంత సారములను జీర్ణించుకుని ఒక కట్టుబాటుతో తనదైన ఒక జీవిత పంథాన్నేర్పరచుకుని తలయెత్తి బ్రతికిన మహామనీషి శ్రీ బులుసు వేంకటేశ్వర్లు. నిత్య జీవితంలో ఏ విషయంలోను 'సర్దుబాటు' అన్నది ఒప్పుకోకుండా ఉద్యోగనిర్వహణలో కూడా 'రాజీ' అను మాటకు తావులేకుండా తాను నమ్మిన సిద్ధాంతాలకోసం ఎన్ని నిష్ఠురాలైనా ఓర్చి 85 సంవత్సరాల 'సింహం'లాంటి జీవితం గడపి 6-7-1991 న కీర్తిశేషులైనారు.

కేంద్ర సాహిత్య అకాడమీనుంచి వీరు పొందిన పురస్కారం కేవలం తెలుగు భాషలో వీరికి గల పాండిత్యం, వేదాంత విజ్ఞానంలో వీరికి గల అపారమైన అవగాహనలకు ఒక చిన్న గుర్తింపు మాత్రమే.

వీరి ఆత్మశాంతి కిదే మా శ్రద్ధాంజలి.

—సంపాదకుడు

## గమనిక

గోదావరి పుష్కరాల సందర్భంగా అనివార్యమైన అవాంతరాలవల్ల
స్వర్గీయ శ్రీ బులుసు సీతారామశాస్త్రి స్మారక పురస్కార సభను
ఆగస్టు నెలకు మార్చుకోవలసి వచ్చినది. సభ జరిగే తేదీ
విషయములు బహుమతి గ్రహీతలకు, పాఠకులకు
ఆగస్టు మొదటివారంలో తప్పక తెలుపగలము.
అనివార్యమైన ఈ కాలయాపనకు
క్షంతవ్యులము.

—సంపాదకుడు

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.**


మనుచరిత్ర పునశ్చరణం– 4



# ప్రవర వరూధినీ సంవాదం


.. డా॥ మిరియాల రామకృష్ణ


ప్రవరవరూధినీ సంవాదం చాలా ...తమైన కావ్యఘట్టం. లోకంలో ఒక ...గన ఒక పురుషుణ్ని తనంత తానే కోరుకుని వస్తే ఆ పురుషుడి మనోభావాలూ, ప్రవర్తన ఎలా ఉంటాయో మనకెవరూ చెప్పనక్కరలేదు. సాధారణంగా ఇది పురుషుడి పతనానికి దారి తీస్తుంది. లోకంలో ఇంద్రియాలను నిగ్రహించుకోలేని పురుషులే ఎక్కువ. ఇంద్రియాలను నిగ్రహించేందుకు మనిషి అంతర్ముఖుడై సంయమనాన్ని అభ్యసించడంకన్నా వేరు దారిలేదు. తరతరాలుగా మనిషి ఈ విషయంలోనే పోరాడుతున్నాడు. కామం మనిషిని పూర్తిగా లొంగదీసుకునే వాంఛ. కానీ ఒక వాంఛకు లొంగిపోకుండా వాంఛనే లొంగదీసుకుంటే మనిషి మహోన్నతుడవుతాడు.

ప్రవరుడి పాత్రని ఈ దృష్టితోనే చూడాలితప్ప, ప్రవరుడు కామానికి లొంగిపోతే ఏమయ్యేది అన్న దృష్టితో చూడకూడదు. ప్రవర వరూధినీ సంవాదంలో బోలెడు తర్కం కనిపిస్తుంది. కావలసిన సుఖాలన్నీ ఎదురై రాగా ప్రవరుడు విముఖత్వం చూపిస్తాడు. వరూధిని అతనితో సమర్థవంతంగా వాదించి ఓడిపోతుంది. ఆ వాదం ఎలా నడిపించాడు పెద్దనగారు? అదీ గమనించాల్సిన విషయం.

వరూధిని తన గొప్పతనాన్నంతటినీ ప్రవరుడికి వివరించుకుంటుంది. ఆమె చరిత్రలో మనం లక్షించే అంశాలెన్నో ఉన్నాయి ఆమె ఏకవచనంలో గాకుండా బహువచనంలో తమ పరిచయం చేసుకోవడం తన జాతి గొప్పతనాన్ని ముఖ్యంగా అప్సరసల ప్రతిష్ఠనూ నిరూపించే ఉద్దేశం ఉంది. అంతే కానీ అహంభావం కనిపించదు.

ఇక్కడ అప్సరసలెవరు అనే ప్రశ్నకు జవాబుకూడా దొరుకుతుంది. దాని ప్రకారం అప్సరసలు సాగర మథన సమయంలో పుట్టిన అందగత్తెలు. వారి విద్యాప్రవృత్తి జంత్రగాత్రాల గాంధర్వ సంగీతాలాపనమే. వాళ్ళకి బాగా తెలిసిన శాస్త్రం కామశాస్త్రమే. యజ్ఞభాగాల్లో వాటాలు లభిస్తాయి వారికి. మేరుపర్వతం మీద కల్పవృక్షాల నీడలో వారు కూచుని గోష్ఠులు సల్పుతారు. త్రిమూర్తుల సభల్లోనూ వాళ్ళకు నాట్యాలు ప్రదర్శించే అవకాశం ఉంది.[1]

ఇలాంటి అప్సరసల్లో వరూధిని ఒకతె మాత్రమే [2] వీరంతా కలిసి హిమగిరి మీద విహరిస్తూ ఉంటారు వినోదంగా. అక్కడ గంగాతీర ప్రాంతాల్లోని ఉద్యానాలు వారి విహారస్థలాలు [3]

ప్రియపరిచయం చేసుకున్నాక, వరూధిని తన ఆతిథ్యాన్ని స్వీకరించాల్సిందిగా ప్రవరుణ్ని కోరింది.[4] నా యింటిని "పావనం చేసి" శ్రమ తొలగించుకు పొమ్మంటుంది–నిజంగా. దీనికి ప్రవరుడి

ప్రతిస్పందన ఏమిటి? ప్రవరుడామె 'హృదయం' గ్రహించాడా? ఆమెకోసం అతనుకూడా వ్యామోహం ప్రకటించాడా? అనే కుతూహలం కలిగించడంలోనే కథ మలుపులుంటాయి. ఇక్కడ 'శృంగార సంఘర్షణ' మొదలవుతోంది. దీన్ని పెద్దన ఎలా నిర్వహించాడో పరిశీలించడం అవసరం

ఈ సంఘర్షణయొక్క రేఖాచిత్రాన్ని కింది విధంగా గీసుకోవచ్చును. కాదు, కాదు, తిరగరాసుకోవచ్చు.

*ప్రవరుడు — నీ సపర్యలన్నీ నా కందినట్టే. మీ యింటికొస్తే ఒకటీ, రాకపోతే ఒకటీ అని నేననుకోవడంలేదు. అభిమానం చాలదా? నేను త్వరగా ఇంటికి పోవాలి. ఎందుకంటే నాకు నిత్యవిధులున్నాయి దయచేసి నన్ను వెళ్ళనీ; కానీ నీ సాయం నాకు కావాలి. నాకు మా ఊరు చేరే ఉపాయం చెబుతావా నువ్వు?మీకు సాధ్యంకానిదేముంటుంది?[5]

*వరూథిని —మీ ఊరు గురించి అంతగా పలవరిస్తావెందుకు? అక్కడేం చిత్రాలున్నాయి? ఇక్కడ చూడు. ఎన్ని అద్భుతాలున్నాయో? రత్నాల గుహలున్నాయి, మంచిగంధపు చెట్లున్నాయి. గంగానది సైకతాలున్నాయి. లవలీలతల పొదరిండ్లున్నాయి. ఇవన్నీ ఇంకా చూడనే లేదుగదా నువ్వు? నిజం చెప్పాలంటే నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నన్ను తిరస్కరిస్తావా? స్వీకరిస్తావా?[6]

*ప్రవరుడు:—అయ్యో! ఇలా మాటాడటం న్యాయమేనా నీకు? నేను నియమాల నతిక్రమించకుండా జీవితం గడుపుతున్న బ్రాహ్మణుడ్ని నీది శారీరకమయిన కామం. నాలాంటివాడ్ని కామించడం ఆలోచనారహితమయిన పని. ఇది తప్పు. నాకు రోజూ చేయవలసిన పనులు మూడున్నాయి. ఒకటి అగ్నికార్యం. రెండు దేవతార్చన. మూడు బ్రాహ్మణ సేవ. మరి ఆ మూడింటికీ ఈ రోజే విఘ్నం కలిగింది. నా తల్లీదండ్రీ చాలా ముసలివాళ్ళు నేను ఇంటిలో కూర్చోనిదే వాళ్ళు బువ్వ తినరు. కనుక ఈ రోజు నేనింటికి చేరకపోతే ధర్మభ్రష్టుడి నయిపోతాను.[7]

*వరూథిని.—చూస్తే పైకి మన్మథుడిలాగున్నావు. పైగా మంచి వయసులో కూడా ఉన్నావు. ఈ వయసునంతటినీ వైదికకర్మలకే ధారపోస్తే వయసు ప్రయోజనం ఏముంటుంది? అసలు వయసుకి ప్రయోజనం ఏమిటో తెలుసునా? భోగాలను తనివితీరా అనుభవించడమే. పైగా అహితాగ్ని నంటున్నావు యజ్ఞాలు చేసేవారుకూడా ఆశించే అంతిమలక్ష్యం ఏమిటి? మమ్మల్ని అనుభవించడానికి స్వర్గంలోకి రావడమే. నువ్వు ఏ ప్రయత్నం లేకుండానే ఆ అనుభవాన్ని ఇప్పటికిప్పుడు పొందవచ్చు నన్నంగీకరించావంటే?[8] అసలు ఈ హిమాలయంలో లభించని భోగాలేమీ లేవు. తాజా కస్తూరి, గమగమలాడే జవాజి, పచ్చకర్పూరం, పన్నీరు, రకరకాల పూలు ఏది కావాలంటే దాన్నిచ్చే కల్పవృక్షాలూ ఇక్కడున్నాయి పైగా నీకోసం 'నేను' ఉన్నాను.[9] నన్ను వద్దని తిరిగి నువ్వు ఆ సంసారకూపంలోనే పడటం, పడతాననడం నాకు విచారం కలిగిస్తోంది.[10]

పురుషస్పర్శ లేకుండా నిరాశలో పడిపోయిన ఒక స్త్రీకి ఒక మన్మథుడులాంటి పురుషుడు కనిపిస్తే, ఆ పురుషుడు కౌగిలి ఆమెకు లభిస్తే ఆమె వెన్నలా ద్రవించిపోతూంటే ఆ పురుషుడు పొందే ఆనందం ఇంతా అంతా కాదు. ఆ ఆనందం పురుషుడికి లభించాలంటే సామాన్యమేనా? ఎన్ని జన్మలెత్తితే అలాంటి ఆనందం కలుగుతుంది?[11]

మనిషికి శరీరం ఉండగా స్వర్గం కలగదు. కాని నీకు శరీరం ఉండగానే స్వర్గసుఖం కలుగుతుంది-నన్ను చేరితే[12]

*ప్రవరుడు.—లోకంలో ఇద్దరు రకాల పురుషులున్నారు కాముకులు మొదటి తెగ. అకాముకులు రెండో తెగ. నువ్వు చెప్పిన ప్రసంగమంతా కాముకులకు నోరూరిస్తుంది. కానీ అకాముకుడికి రోత కలిగిస్తుంది. ఇవన్నీ ఎందుకు? నీకు తెలిస్తే నాకు నా నగరమార్గం చూపించు చాలు. నీకు పుణ్యముంటుంది. నేను బ్రాహ్మణుడ్ని బ్రాహ్మణుడంటే ఎవరు? బ్రహ్మజ్ఞానం గలిగినవాడు కదా బ్రహ్మజ్ఞానం అంటే ఏమిటి? ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవడంవల్ల కలుగుతున్న తెలివితేటలు. ఆ తెలివితప్పితే, ఇంద్రియాలకు వశమై, పంకిలంగా నడతలు సాగిస్తే ఏమవుతాడు? కోరికలకు-ముఖ్యంగా-మనోవాంఛలకు లోబడిపోతాడు. అలాంటివాడికి బ్రహ్మానందం కలగదుగదా![13]

ఇంతవరకూ జరిగిన సంవాదంతో వరూధిని నోరు మూతపడిపోయే పరిస్థితి ఎదురయింది. ప్రవరుడు చెబుతున్న నీతి, ధర్మం వరూధిని కోరికముందు మహోన్నతంగా ఉన్నాయి. కానీ ఆమె తనకోరికను చంపుకోలేకపోతూఉంది [14] అందుకే మళ్ళీ వాదనలోకి దిగుతుంది. ప్రవరుని ధర్మాన్నీ కాదని చెప్పడానికి అవకాశాలు వాదించేవాని మనస్తత్వాన్నిబట్టి ఏర్పడతాయి కనుక ఈ వాదంకూడా సహజంగానే అనిపిస్తుంది.

*వరూధిని:—మనిషికి అయిదు ఇంద్రియాలున్నాయి.అవి ఏ యే విషయాల్లో ఆనందం పొందుతాయో అదేకదా జ్ఞానమంటే? ఆనందమూ జ్ఞానమూ ఒక్కటే. ఆ ఆనందం స్త్రీ పురుష సంయోగంవల్ల ఆ సంయోగంలో పాల్గొన్న ఆ స్త్రీ పురుషులకిద్దరికీ కలుగుతుంది. వేదం ఏం చెబుతోంది? 'ఆనందో బ్రహ్మ' అంటోంది. ఆనందమంటే ఈ భౌతికానందమే. అదే పరబ్రహ్మతత్త్వం.[15]

ఈ వాదం వేదాంత (ఉపనిషత్తుల) జ్ఞానం గల ప్రవరుడికి సిగ్గు, వెగటు (Shame and Impatience) కలిగించింది. అతనికి ఇలాంటి ధర్మశూన్యమైన శృంగారంమీద సుతరామూ ఇష్టంలేదు.అందుకే ఆమనసు (mood) తోనే చిరునవ్వు నవ్వుతూ జవాబు చెప్పాడు.[16]

*ప్రవరుడు:— ఈ ప్రపంచంలో ఇంతవరకూ ఎవ్వరూ 'ఆనందో బ్రహ్మ' అనే బృహస్పతి కిలాంటి అర్థం చెప్పలేదు. నువ్వే మొదటిసారిగా చెబుతున్నావు. చూస్తే ఆలోచిస్తే నీవు ఒక శృంగార పాఠాలు బోధించే 'గురువు లా గున్నావు. (Sexologist or Pornographist) వేదధర్మాలన్నీ పాపాలనీ, శృంగారానుభవం పుణ్యకార్యమనీ అంటున్నావు ఈ రకంగా అర్థాలు తారుమారు చేయడం మీ జాతి సంప్రదాయమేమో నాకు తెలియకుండాఉంది. అసలు 'మోక్షం' (Emancipation or Liberation) అనే మాటకి మీరిలాంటి అర్థాన్నే చెబుతారు కాబోలు.[17] నేను పొద్దున్నా సాయంకాలమూ కూడా యజ్ఞం చేస్తాను. అగ్నిదేవుడే అన్ని సుఖాలనూ నాకిస్తాడని నా నమ్మకం. అగ్ని శక్తి నీకెలా తెలుస్తుంది? నాకు అగ్నులు, ఆచారాలు, అగ్నులు ముఖ్యం. కానీ నీకివన్నీ అక్కర్లేదు. నీకు శారీరక సంయోగం పరమావధి. కానీ ఈ శరీరం ఎలాంటిది? ఇది ఎలాగూ చెడుతుంది. సంయోగంవల్ల, రతివల్ల కలిగే ఆనందం క్రమంగా నాశనానికే దారితీస్తుంది. పైగా అది తాత్కాలికం. మీసంమీద తేనెబొట్టు లాంటిదే కానీ నాలుకమీద తేనెచుక్క కాదు [18]

ఈ జ్ఞానమీమాంసతో వరూధిని నోరు కట్టబడిపోయింది. కానీ ఆమె మనసు చావలేదు. మొగం వెలవెలలాడక తప్ప లేదు. కన్నుల నీరాగిలేదు. మాటాడబోతే గొంతు పెగలలేదు. కానీ చివరికి మాట పెగిలింది నిష్ఠురంగా. ఏమని?[19]

*వరూధిని —నేను చేసిన పొరపాటు నాకర్థమయింది. నేను స్త్రీని. నీచేత వలపించుకోవలసింది పోయి నేను వలచి వచ్చాను కనుక చులకన అయిపోయాను.[20] నన్నింక బాధపెట్టవద్దు.

ఇంతవరకూ జరిగిన సంవాదం ఒక ఎత్తు. తరవాత వరూధిని తనంత తానే ఆచరణకుద్యమిస్తుంది ఇది విస్తారం.[21] శారీరక సంయోగం కోసం వరూధిని ఎంత తొందరపడిందో ఆ తొందరను వర్ణచిత్రంగా చూపడానికి పెద్దనలోని కళాకారుడు సందేహించలేదు. సరే, వరూధిని తొందరపడితే మాత్రం ఏమయింది? 'హా శ్రీహరీ' అని ప్రవరుడు మొహం పక్కకు తిప్పేసుకుని. ఆమె భుజాలను పట్టుకుని త్రోసివేశాడు.

ఈ ఘట్టంమీద కవి ఒక తీర్పు చెబుతున్నాడు ఏమని? కామవాంఛతో స్త్రీలు ఎన్ని మాయలు పన్నినా, ధైర్యవంతులు లొంగిపోరని. దానికి నిదర్శనమే ఈ ఘట్టం. వరూధినినే ఇక్కడ 'దోషి'గా నిరూపించడం జరిగిపోయింది— అయితే వాచ్యంగా కాదు; వ్యంగ్యంగానే. తోసివేయబడిన వరూధిని ఊరుకుంటుందా? వరూధిని నోరు పారేసుకుంటూ "నీకు దయలేదు, కటికవాడవు; నన్ను త్రోసివేశావు బలవంతంగా. ఇలా చూడు నీ గోరిక్కడ గుచ్చుకుంది" అంటూ ఏడుపు మొదలెట్టింది.[22] తరవాతకూడా ఆమె ఊరుకోలేదు. ఒక పాఠం చెప్పింది. "యజ్ఞాలు చేయడం కాదు ముఖ్యం, మనిషికి 'దయాగుణం' అవసరం. ఆ గుణం లేకుండా ఎన్ని పుణ్యాలు చేసినా వృథా. భూతదయతోకూడిన బుద్ధి మనిషికుండాలి" అంటుంది,

'పరాశరుడు, విశ్వామిత్రుడు, మాందకర్ణి, ఇంద్రుడు కామాన్ని జయించలేక

పోయినా పూజ్యులయ్యారుకదా! ఇంద్రియ విగ్రహం ఉన్న ఋషులుకూడా స్త్రీలకు లొంగిపోయారుకదా' అని పురాణాలను తడుముతుంది.[23] ఇంకేమంటాడు ప్రవరుడు? ఆమెకు సమాధానం చెప్పడు. అగ్నిదేవుణ్ని ప్రార్థించి, కాంతిమంతుడై వాయువేగంతో యింటికి చేరుకుంటాడు.[24]

## అధ్యయన సూచికలు

1. నిజంగా ఎంతో మంచి పద్యంగా తెలుగువాళ్ళ నోళ్లలో నానిన పద్యం ఇది. 'చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టువు మాకు' అని మొదలయ్యే ఈ సీసం సాంప్రదాయిక కవితాగరిమ నంతటినీ పుణికి పుచ్చుకుంది. గాయకలోకమంతా సగర్వంగా ఉటంకించుకునే పాదం "రహిపుట్ట జంత్రగాత్రముల తాల్ గరగించు విమలగాంధర్వంబు విద్య మాకు" అనే పాదం. ఇలాంటి పద్యాలవల్ల మనుచరిత్ర ఒకటి చదివితే, అంతకు ముందువారిని గానీ వెనుకవారిని గానీ చదవాల్సిన అవసరం ఉండదనే అభిప్రాయం కూడా రసజ్ఞలోకంలో ఏర్పడింది.

2. ఘృతాచి, తిలోత్తమ, హేమ, రంభ, శశిరేఖ అప్సరసల నామధేయాలు. వీరంతా వరూధిని ప్రాణసఖులు. చూ. 44వ పద్యం.

3. "నభోవాహినీ లహరీ శీతల గంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభ గ్రహణోం దిందిర తుందిలంబు లివి మత్కాంతార సంతానముల్" అంటుంది వరూధిని. అది పెద్దనగారి చతురోక్తిని నింపుకున్న వాక్యం. 45 పద్యం.

4. ఇక్కడ వరూధిని తన మణిభవనంలోకి రమ్మని ఆహ్వానిస్తూ 'కైతవ కుసుమశరాసన' (మాయవేషంలోని మన్మథుడని భావం) అని సంబోధించి తన కామవ్యామోహాన్ని సూచిస్తుంది. అయినా ఆ సంబోధనామర్మాన్ని అతను లెక్కచెయ్యడేమో అని సందేహిస్తూ అతని అందాన్ని వాచ్యంగా పొగుడుతుంది. "చందనమువంటి మేను మధ్యందినాతపోష్మహతిఁ గందె, వడదాకె ఒప్పులొలుకు వదనము- అస్మద్గృహంబు పావనము సేసి బడలికలు వాసి చనుము''అంటుంది. ఇక్కడ వాచ్యం అత్యంత తిరస్కృతమవుతోంది. అది పెద్దన శిల్పమర్మం.

5. "సత్క్రియాకాండము దీర్పలేక సనగావలయున్'' "ఏనిక నిల్లు సేరుటకు నెద్ది యుపాయము'' "ప్రజలన్ ననుగూర్చుము'' వంటి మాటల్లో ప్రవరుడి మనస్సెంత తొందరపడుతూందో అర్థమవుతుంది. ఈ మాటలకు వరూధిని నవ్వడం సహజమే. ఇక్కడ కవి చతురోక్తి చూడదగింది. ''లేతినవ్వు అననసీమ దోప ధవళాయతలోచన వాని కిట్లనున్'' అని వ్యాఖ్యానిస్తాడు పెద్దన మనకు కుతూహలం కలిగిస్తూ.

6. ఈ అభిప్రాయాల్ని కవిత్వీకరించడంలో పెద్దన చాతుర్యం భాషాసంప్రదాయం తెలిసినవారి కానందం కలిగిస్తుంది. ముఖ్యంగా "మీ కుటీర నిలయంబులకున్ సురరాజభోగమె యిక్కడి రత్నకందరములు" "నిక్కము దాపనేల .. నీ పయిన్ జిక్కె మనంబు నాకు- ననుచిత్తజు బారికి నప్పగించెదో చొక్కు మరందమద్యముల మాలెఁ బాటలు వాడు తేంట్ల సొంపెక్కిన యట్టి పూపు- బొదరిండ్లను కౌఁగిట గారవించెదో'' వంటి మాటలు వాచ్యంగా ఉండికూడా చమత్కారాన్ని కలిగిస్తున్నాయి. ఇవి తెలుగుతనపు చమత్కారమే అనడంలో సందేహం లేదు.

7. "క్రతువులై దినములు గడపెడు విప్రులఁ జనునే కామింప- మది విచారము వలదే" అనే మాట వెలువడుతుంది ప్రవరుడినుంచి. ఇది అతని సంస్కారానికి దర్పణం. అంతేకాదు; సాధారణీకరణం చేయబడిన ధర్మశాస్త్రం ఇది. 'ఆహితాగ్ని'గా తనను తాను ప్రవరుడు నిర్దిష్టం చేసి చెప్పుకుంటాడు వరూధినితో. "తూలు సమస్త ధర్మములు- నేడిలు సేరకుండినన్" అని చెప్పడంలో ప్రవరుడి జీవితవిధానం మరోమారు స్పష్టమవుతుంది.

8. 'ఎలప్రాయము వైదికకర్మ నిష్ఠలన్ బోవఁగ నింక భోగములు పొందుట ఎన్నడు?' అని ప్రశ్నిస్తుంది వరూధిని. పైకి బాగుంటుంది ఈ ప్రశ్న. 'యజ్ఞకోటులన్ సాధనులవుటకున్ ఫలము మా కవుగిళ్ళ సుఖించుటే గదా' అని చెప్తున్న వరూధిని మాట ఎంతవరకూ సత్యం? ఇది పురాణకల్పన నాధారంగా చేసుకున్న సత్యం మాత్రమే. ఇక్కడ వరూధిని అవకాశవాదం బైటపడిపోయింది. అందుకే ఆమె మరికొన్ని హితోక్తులు చెప్పవలసి వస్తుంది" సద్యోవినిర్భిన్న సారంగనాభికావ్యాప్తమై పిసాళించు మృగమదంబు' అనే సీసం చూడండి.

9. 'ఇందు భోగపుడవయి గమింపుము ననుగూడి యనుదినంబు' అంటుంది వాచ్యంగా వరూధిని. వరూధిని వాక్యభావనం ఇక్కడ మనకి ఎబ్బెట్టు కలిగిస్తోందా? లేదనిపిస్తోంది. అభిప్రాయభేదం ఉంటే పాఠకులు చెప్పాలి.

10. ఇక్కడ పెద్దన చూపిన పనితనం భావన (Imagination) కు సంబంధించింది. గడ్డివాడికి వెన్నెల దేనికి? గుడ్లగూబకు వెలుగుమాత్రం ఎందుకు? ప్రవరుడికి వరూధిని కోరదగిందే కానీ వరూధినికి ప్రవరుడు అనస్పృహుడని తెలిపా

యింది. ప్రవరు డొక అంధుడు. ప్రవరు డొక దివాంధం. వరూధిని వెన్నెల. వరూధిని వెలుతురు. ఆ భావన సారాంశం అలా వుంది.

11. దాంపత్య దృష్టితో చూస్తే ఇంత గొప్ప సత్యం మరొకటుండదు. కానీ ఇక్కడ ఈ మాట అంటున్నది స్వార్థపరురాలైన వరూధిని. వరూధిని చేత అనిపించిన ఈ మాటల్లో పెద్దనగారు లోకంలోని స్త్రీ మన స్తత్వాన్ని పురుషుని అదృష్టాన్ని వివరించడం మాత్రం నిజం. 'ఎన్ని భవంబులన్ గలుగు నిక్షుశరాసన సాయక వ్యథా భిన్నత వాడిన త్తలయి... వెన్నవలెన్ గరంగు నలినేణుల గౌగిట జేర్చు భాగ్యముల్" అంటుంది వరూధిని. ఈ వరూధిని మాటలు నిజానికి పెద్దన గారి మనస్సులోవే.

12. 'సశరీర స్వర్గసుఖం' అనే మాట నిక్కడ ప్రయోగించడం ఒక చిత్రమైన ఊహాపథకం (Hypothesis).

13. ప్రవరుడి బ్రహ్మజ్ఞానం (Spiritual knowledge) అంతా ఇక్కడ ప్రకాశిస్తుంది. స్వర్గం, మోక్షం వంటి కీలకాంశాలమీద కూడా రెండు రకాల సిద్ధాంతాల అభిప్రాయాలున్నాయి వరూధిని చెప్పింకొక పార్శ్వం మాత్రమే. ప్రవరుడు దాన్ని మెత్తగా ఖండించాడు. 'ఏవన్న యజ్ఞ మల్ల నిజము కామించిన వానికి' అంటూనే "అకాముడు దేని గణించునని?" అని వాదంలోకి దిగాడు. అంతే కాకుండా వరూధిని వాదాన్ని పూర్వపక్షం చేసి, "బ్రాహ్మణు డింద్రియ వశగతి జిహ్మచరత్వైక నిపుణ చిత్త జనిత జన్మగహనంబు పాలై చెడు బ్రహ్మానందాధి రాజ్య పదవీ మ్యుతుడై" అని సిద్ధాంతం చేశాడు దానితో వరూధిని ఓడిపోయి నట్లే అయింది. వరూధిని వాదం లోక ధూయిష్ఠం. పెద్దన ఆస్తికత ఇక్కడ ప్రవరుడి సిద్ధాంతంలోనే ప్రతిఫలిస్తోంది.

'బ్రాహ్మణు డింద్రియవశగతి' అనే కందపద్యం (60వ పద్యం) చాలా ముఖ్యమైన పద్యం. ప్రతి మేధావికీ ఇదొక ప్రశ్న. ఇందులో "జిహ్మ + ఆచరణ + ఏక - నిపుణ - చిత్తజ-నిశిత + అజిహ్మగ కాండపాలు డై" అనే పదసంఘటన కొంచెం క్లిష్టం. జిహ్మాచరణం అంటే వంకరలు కలిగించడం; అజిహ్మాగం అంటే బాణం. ఈ సమాసం మనకు బాగా గుర్తుండటానికి ఉపకరిస్తుంది.

14. ఈ సన్నివేశ సందర్భానికి తగినట్లు పెద్దన ఇక్కడ విరటుగాఉండే శైలిలో ఒక వచనం రాశాడు. మనోజ్ఞ వచనం మాత్రం కాదిది. ఇందులో ఆమె మానసిక శారీరక ప్రతిక్రియలను వివరించాడు ఊహారమ్యంగా. ఆమె విసుగు, విరాగంలో పడే చిత్తవృత్తి, అతని మెలాగైనా తన చేష్టలతో లొంగదీసుకునే ధోరణి కనిపిస్తాయి.

15. స్థూలంగా వరూధిని అవగాహన ఇంతే. ఆమె కాముకురాలవడంచేత తన కోరికలకు తగినట్లే వేదవాక్యాన్ని వ్యాఖ్యానిస్తోంది. అంతకుముందు ప్రవరుడు 'బ్రహ్మానందం' గురించి చెబుతూ ఇంద్రియ వశగతంవల్ల బ్రహ్మానందంనుంచి జారిపోతాడు బ్రాహ్మణుడు- అన్నదానికది సమాధానం (మూ. 60వ పద్యం).

'ఎండకు డెందము కందళించునో ఏకాగ్రతన్ నిర్వృతిన్ చెందునో ఎండే ఇంద్రియముల్ సుఖంబుగనునో ఆయుంటే పరబ్రహ్మం' అంటోంది వరూధిని (61వ పద్యం). ఇందులో ఆమె ఒక ఉపమానం కూడా చెప్పింది. 'కుంభగత ప్రదీపకళికాశ్రీ' అనే ఆ పోలిక. గాజుకుప్పె (Glass jar) లో పెట్టిన దీపంలా మనస్సు కదిలిపోకుండా నిలిచి వెలుగుతుండటం కాదిది సంయోగంలో. ఇదీ ఆమె వ్యాసంగం. వేదాంతులు వాడే నిర్వృతి (Bliss), ఏకాగ్రత (Concentration) వంటి పరిభాషల్ని ఆమె కూడా వాడింది. పదాలవరకే ఈ ద్వంద్వార్థాలే మన వాదాలన్నింటికీ మూలం. అందులోనూ వేదాంతం (Indian philosophy) మనదంతా. ఇలా సాగతీత (Elasticity) కనుకూలంగా ఉండటంవల్ల విచక్షణ (Judgement) ఎవరికి చాలా అవసరం. కేవలం జ్ఞానం (Knowledge) కన్నా విజ్ఞానం (Wisdom) కావ్యానికి పరమావధి. ఆ విజ్ఞానం ప్రవరుడి మాటల్లో ఉన్నట్లు వరూధిని మాటల్లో ఉండదు. అంత పాత్ర గలిగించినా, పెద్దన హృదయం ప్రవరుడిలోనే ఉంది- అని వేరే చెప్పనక్కర్లేదుగా.

16. 'నిష్పృహాత దెలుపు నొక్క చిరునవ్వు నవ్వి' అని పెద్దన గారి మాట.

17. 'ఈ పాండిత్యము నీకు దక్కెనార యెండ గంటివో' అనే పద్యంకూడా తెలుగువారికి పూర్వం కంఠస్థమయ్యిందే. ఈ పద్యంలో చిత్రమేమంటే వ్యాజస్తుతి. (పొగడుతున్నట్లు కనిపించే నింద). కామశాస్త్రపాఠ్యయిని అనే మాట మనల్ని నిల్పుతుంది. Woman-Sexologist అనేగే విరుద్ధమైన భావం (Contradiction) కామశాస్త్రాన్ని వాత్స్యాయనుడు చెప్పాడు. ఆ కాలానికి పురుషుడే కామశాస్త్రం చెప్పడం- అందుకోగా ఒక పురుషుడికి- అది వింత. అదే ప్రవరుడి ఆక్షేపణ. (నిజానికి ఇది పెద్దనగారి ఆక్షేపణే). 'మేలోవహో' అనేది పైకి ప్రశంస. కాని ధ్వనిమాత్రం నింద. 'త్రయీధర్మాలు పాపా - గతిపుణ్యం' అని చెప్పడం ఆర్యావర్తసంస్కృతికి విరుద్ధం కొత్తగా అడుగు

పెట్టిన ముకుళ్యాముల నీవి విక్కడ విదుర్చించడం ఉందా అని ఆలోచించాలి. 'పాతివ్రత్య పథ్యాగమ సూత్ర పంక్తికిది పో మీ సంప్రదాయార్థముల్' అనే మాటల్లో 'మీ సంప్రదాయ' అనే దాని మీద తూనిక పడుతుంది.

18. వరూధిని నీటిలో పుట్టిన అప్సరస. ప్రవరుడు అగ్ని నారాధిస్తాడు. అతను ఆమెతో సంయోగించేస్తే అగ్ని ఆరిపోవడం సహజం. ఈ స్వారస్యం ఈ కథలో పెద్దన 'వస్తుధ్వని'గా 'తత్త్వ ధ్వని'గా నిక్షేపించాడా? అని ఆలోచించవలసి ఉంటుంది. సమస్త జీవిత సుఖాలకూ అగ్ని ప్రధానం తరవాతిదే నీరు. అగ్నిగోళమైన సూర్యుడే నీటికి కూడా ఆధారం అనేది చిరంతనసత్యమే కాక ఆధునిక శాస్త్రసత్యంకూడాను.

'చెప్పవె మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపై - తేనియల్' అనే సూక్తి సందర్భసత్యమే కానీ సార్వత్రికసత్యం కాదు. దాంపత్యసుఖం మీసాలపై తేనె కాదని ప్రవరుడి పాత్ర నిరూపిస్తుంది.

19. 'వనిత తనంత దా వలచి వచ్చిన చుల్కన గాద యేరికిన్' అనేది సాధారణీకరణం చేయబడిన సత్యం. కానీ లోకంలో స్త్రీ పురుషుడ్ని ప్రేమించాలా? పురుషుడు స్త్రీని ప్రేమించాలా? అనే చిత్రమయిన ప్రశ్న ఉంది. ప్రేమ, కామం ఇద్దరికీ సమానమే. కానీ అది ధర్మవిరుద్ధమైనపుడే ఈ సాధారణీకరణ సత్యం వర్తిస్తుంది. వరూధిని పరాజితురాలైనందువల్ల అపకారవాదం (escapism) అవలంబిస్తోంది. ఇది పాత్రగతం. అంతేకాని పెద్దన అభిప్రాయం కాదు.

21. ఈ విద్దూరాన్ని 'ప్రబంధాల బూతు'గా ముద్ర వేస్తున్నాం. సరే. కానీ భాషాసంప్రదాయం ఈ బూతును (Pornograph) ప్రచ్ఛన్నం చేసి, కాపాడింది. నీవి బంధమూడిపోయింది. విరులు చిందిపోయాయి. కొప్పు వీడిపోయింది. శరీరం పులకరిస్తోంది. రతి సంరంభంతో ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో పాలిండ్లు పొంగార-పైయెంచల్ మోవగ కౌగిలించి యధరం బానించింది వరూధిని. దీన్ని 'చీకటి తప్పు'గా పరిగణిస్తాం మనం. శృంగార చర్చ నింతగా వర్ణించనక్కరలేదనేదే మన తీర్పు-కానీ ప్రవరుడి కిదొక పరీక్షగా మారిందనేది స్పష్టమవాలంటే ఎలా? ఈ ప్రశ్నకు జవాబుండదు. దీన్ని గురించి చర్చ జరగాలి.

22. "ఇచ్చోట ధవన్నఖాంకురము పోకుంగనుంగొనుము" అంటూ ఏడ్చింది వరూధిని. ఆ సమయంలో ఆ సంస్కారమంతే కాబోలు. పెద్దనగారు ఆమె ఏడ్పుని వర్ణించడంలో మొహమాటపడలేదు. "వేవన నెపంబిడి యేడ్చె-కలస్వనంబుతో మీటిన విచ్చు గుబ్బచను మిట్టల నశ్రులు చిందువందగన్" అంటూ రసికజనానందాన్ని ఆశించాడు. "కన్నుగవ ధరళి సుచుల్ కాలిగొనగా" ఏడ్చిందంటూ బొమ్మను క్షణంలో మార్చుతాడు పెద్దనగారు.

23. గతంలో కొందరు పెద్దలు తప్పులు చేశారని తప్పులు సాంప్రదాయాలుగా మారవు. అలా అనుకరించడం మంచిదనడం వరూధిని వాదంలోని ప్రధాన లోపం. కాలం గడిచినకొద్దీ మానవుడు మరింత పరిపూర్ణుడు కావాలనే సందేశ ధ్వని లేదా ధ్వన్యాత్మక సంకేతం (Suggestive message) పెద్దన మనసులో ఉన్నట్లు కనిపిస్తుంది.

24 అగ్నిదేవుడ్ని ప్రార్థిస్తే గమనసిద్ధి స్పందనడం నమ్మశక్యంగా ఉండని మాట నిజమే. కానీ ఇది అధివాస్తవికమైన సత్యంగా తీసుకోవడం సాధ్యమే కదా. ఏ కథలోనయినా స్వాభావికతకు అతీతమైన సంఘటనలు (Super natural elements) ఉండటం ప్రపంచ సాహిత్యాలన్నింటా కనిపించేదే. అగ్నికి గమనశక్తి లేదా చోదకశక్తి ఉందనడం శాస్త్రీయ సత్యమే ఈనాటికి- ఈ రాకెట్ల యుగంలో.

డా॥ మిరియాల రామకృష్ణ,
25-6-5/3,
రాజమండ్రి - 5.

—0—

# ఎఱ్ఱన కవిత్వము - జనజీవితము

—శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

(గత సంచిక తరువాయి)

ఈ సందర్భంలో ఒక పరమ రహస్యాన్ని గుర్తించవలసి ఉంది. నన్నయగారు భారతాన్ని ప్రారంభిస్తూ 'తన కుల బ్రాహ్మణు-అనురక్తు' అని తనను గూర్చి ఒక సీసపద్యం చెప్పుకొన్నారు. ఇది కూడా ప్రథమపురుషలోనే ఉంది. నన్నయగారిలాగే వ్రాయలని పూనుకొన్న ఎఱ్ఱయగారు కూడా తనను గూర్చి ప్రథమ పురుషలోనే చెప్పుకోవడం - అది కూడా సీసపద్యమే కావడం కాకతాళీయంకాదు. ఎఱ్ఱయగారి తత్పరతకు దర్పణం.

ఎఱ్ఱయగారు ప్రబంధ పరమేశ్వరుడు.

ఈ బిరుదును గూర్చి కూడా అభిప్రాయ భేదాలున్నాయి. ఆయన రచనల అను పూర్విని నిర్దేశించడంలో దీనిని పండితు లంతా ఒక సాధనంగా వాడుకున్నారు. ఇందులో ఒక విశేషం గమనించవలసి ఉంది.

ఆ రోజుల్లో ప్రబంధ శబ్దం ఈనాటి అర్థంలో వాడుకలో లేదు. కావ్యసామాన్య వాచిగానే వాడబడింది. 'ప్రబంధ మండలి' అని - 'పుణ్యప్రబంధా' అని తిక్కనగారు చెప్పడంఇందుకు సాక్ష్యం.

ప్రబంధం అంటె ప్రకృష్టంగా బంధించి మహాభారతాన్ని పూర్తిచేయడం వల్ల ఆయనకీ బిరుదు వచ్చింది. ఈ విషయాన్నే పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు 'అట్లాంటిక్ మహాసముద్రమువంటి నన్నయ కవితను - శాంత మహాసముద్రము ఎఱ్ఱయకవి, అని ఎంతో రమ్యంగా అభివర్ణించారు.

ఎఱ్ఱయగారు శివభక్తులు. 'గిరిశ పద భక్తి రసతత్పర భావమున కలిమి శంభు దాసుడనగా ఒరిగి' నాతని ఆయన తాత గారు మెచ్చుకొన్నారు. ఈ 'శంభు దాసు' డనేది తన 'అత్మనామాభిధేయ' మని తాను 'శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణ సరోరుహ ధ్యానానంద సౌందర్య ధుర్యుడ' నని చెప్పుకున్నాడు.

దీనిని బట్టి ఎఱ్ఱనగారు స్మార్త బ్రాహ్మణులని పండితులంతా నిర్ణయించారు. ఈవిషయాన్ని గూర్చి మరింత లోతుగా ఆలోచించవలసి ఉంది.

ఎఱ్ఱనగారు తన తండ్రి 'ఆరాధ్య' సర్వజ్ఞుడని సగర్వంగా చెప్పుకున్నారు. ఈ ఆరాధ్య శబ్దం కేవలం గౌరవవాచి కాదు. క్రీ. శ. 11 వ శతాబ్దివాడైన మల్లికార్జున పండితారాధ్యుడు భక్తి మీది వలపుక బ్రాహ్మణ్యంబుతో పొత్తుకలిపి ఆంధ్రదేశంలో ఆరాధ్యశైవ సంప్రదాయాన్ని ప్రచారం చేశాడు. ఆయన పాండిత్యానికి, వాదనాబలానికి, మహిమలకు తల ఒగ్గి ఎందరో, స్మార్త బ్రాహ్మణులు ఆరాధ్య శైవాన్ని స్వీకరించి 'ఆరాధ్యు' లని పేరు పొందారు. సూరనామాత్యుడు కూడా వారితో పాటు ఆరాధ్య శైవాన్ని స్వీకరించడమే కాక ఆ సంప్రదాయం యొక్క రహస్యాలను పుక్కిటబట్టి 'ఆరాధ్య సర్వజ్ఞు'డై ఆరాధ్య శైవప్రచారంలో పాలుపంచుకొని ఉంటాడు. ఆయన కుమారుడు కూడా శివభక్తతత్పరుడైన ఆరాధ్యుడే కాని అన్యుడు కాడని అభిప్రాయం.

అయితే ఇక్కడ ఒక్క విశేషం గమనించవలసి ఉన్నది. ఎఱ్ఱయగారి తాత ఎఱ్ఱపోతసూరి తప్ప ఆయన వంశీకు లంతా శివభక్తులే! అయినా వారికి హరిహరాభేదం లేదు. ఎఱ్ఱయగారు తాను ఎంత శివభక్తుడి నని చెప్పుకున్నా వ్రాసినవన్నీ హరికథలే! ఇంతేకాదు ఆయనకు సుమారుగా 6 తరాల తర్వాతి వాడైన చదలువాడ మల్లన శ్రీ కాళహస్తీశ్వర దయాసంపాదిత కవితావైభవంతో 'రుక్మాంగద చరిత్ర - విప్రనారాయణ చరిత్ర' అను వ్రాశాడు.

ఈ మత సామరస్యాన్ని - సర్వదేవ నమస్కారాన్ని చూస్తుంటే అప్పయ దీక్షితులవారి అభిమతం ఒకటి జ్ఞాపకం వస్తున్నది.

'వాసుదేవ యితి వామ దేవయిత్యస్తి కల్పకమహీరుహద్వయం - తద్వ్యయోపి హి కుసుమభేద సంభవః నాస్త్యథాపి ఫల భేద సంభవః,

వాసుదేవుడో - వామ దేవుడో 'కుసుమ' భేదమేకాని మోక్ష 'ఫల' భేదం లేదంటాడు. ఈ తత్త్వాన్ని సంపూర్ణంగా జీర్ణించుకొన్నవారు ఎఱ్ఱనగారు-ఆయన వంశీకులు. ఇదిలా ఉండగా ఎఱ్ఱయగారు ఈ కావ్యాలనే - ఈ వరుసలోనే వ్రాయడానికి గొప్ప చారిత్రక దృష్టి - సామాజిక స్పృహ తోడ్పడ్డాయి. ఈ తోడ్పాటును గూర్చి 'అనుశీలనం'లో ప్రత్యేకంగా చెప్పుకుందాం!

ఎఱ్ఱయగారు సకల భాషా కవిత్వవిశారదుడు. సాధుసమ్మతుడు. నిత్య సౌమ్యమతి. గురు భజన పరాయణుడు. వినయోదయ ధరితుడు. సకల బహుపురాణకథా విస్తర వేది. ఆయననుగూర్చి బాగా తెలిసిన వాళ్ళు - ఆయనతో కలసి మెలసి జీవించిన వాళ్ళు చెప్పిన విశేషణాలివి. ఈ అన్నింటిలో ప్రధానంగా కనపడుతున్నది ఆయన వినయ సంపత్తి. అది ఆయనకు ఒక అలంకారమైంది. అది ఆయన జీవలక్షణం.

ఆయన రామాయణం వ్రాశాడు. హరివంశం చెప్పాడు. అరణ్య పర్వ శేషాన్ని పూరించాడు. ప్రబంధ పరమేశ్వరుడనగా ఎన్నిక అయ్యాడు, నన్నయ తిక్కన కవినాథుల సరిగద్దియ ఎక్కాడు. వినా తన చివరి రచన నృసింహపురాణాన్ని ప్రారంభిస్తూ ఇలా చెప్పుకొన్నాడు.

'మించిన వేడ్క వీనులకు నిక్కువమై
మగవృత్తి గ్రమ్మరా
యించలు కాదు క్రొంచవమును నావల
గూయ గడంగు తంగి బ్రా
ఘాంచిత శబ్దసారులు మహాకవులాద్యులు
కావ్యకళయ్యౌగి
లించిన కీర్తసంగ సుఖలీలకు నేనును
గాంక్ష చేసితిన్ '!'

కవిత్వం గురువు కాళిదాసును తలపించి, మరపిస్తున్న ఈ పద్యం ఆయన వినయ వినమిత శీలానికి పరాకాష్ఠ.

అంతటి మహాకవికి - సాధు సమ్మతునికి - వినయోదయ ధరితునికి - ప్రబంధ

పరమేశ్వరునికి పరమాదరం క్రమంలో మిల్లి, ఆయన కావ్యాలలో ప్రతిఫలించిన సమాజాన్ని దర్శించుకునే ముందు ఆయన చూచిన కాలాన్ని - ఆయన, అనుసరించిన సమాజాన్ని పోలుత బేరీజు వేసుకోవడం సమంజసంగా ఉంటుంది.

ఎఱ్ఱనగారు క్రీ.శ. 1280లో జన్మించి క్రీ.శ. 1355 ప్రాంతంలో కైవల్యం చెందారు. ఈ మధ్యకాలంలో ఆయన మూడు ముఖ్యమైన పరిణామాలను చవి చూచారు.

ఒకటి - కాకతి సామ్రాజ్య పతనం. ఇది క్రీ.శ. 1323 లో జరిగింది. రెండు తురుష్కుల దండయాత్రలు - దౌర్జన్యాలు. ఇవి క్రీ.శ. 1302 లో ప్రారంభమై క్రీ.శ. 1327 - 28లో ఒక కొలికికి వచ్చాయి. మూడు - స్వాతంత్ర్య పోరాటం. స్వతంత్రాంధ్ర రాజ్యాల స్థాపన. ఇది సుమారుగా క్రీ.శ. 1330 నాటి మాట.

ఇందువల్ల ఎఱ్ఱనగారి కవితలో సమాజాన్ని గుర్తించటానికి గాను ఆయన నాటి మత సాంఘిక రాజకీయ ఆర్థిక వ్యాపార రంగాలను ఆకళింపు చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

మతము :

తొలినాళ్ళ నుండి హిందూ జీవన విధానాన్ని - సామాజిక వ్యవస్థని నిర్ణయించింది, శాసించింది మతం. నాలుగు వేదాలు - ఆరు శాస్త్రాలు - 18 పురాణాలు - రెండు ఇతిహాసాలు హిందువుల మతానికి ధార్మిక జీవనానికి పునాది రాళ్ళు. వీటి ఆధారంగా నిర్మించబడ్డది వైదిక మతం. కాలక్రమంలో యజ్ఞయాగాల పేరుతో జంతుబలిని కొనసాగిస్తూ, ఆచారాలతో - ఆడంబరాలతో సామాన్య ప్రజానీకానికి దూరమైన తరుణంలో వేద ప్రామాణ్యాన్ని ప్రశ్నిస్తూ, బ్రాహ్మణాధిక్యాన్ని సవాలు చేస్తూ బ్రాహ్మణేతరుల చేత ప్రారంభించబడ్డాయి బౌద్ధము - జైనము.

ఇవి రెండూ ఆంధ్రదేశంలో బాగా ప్రచారం పొందాయి. అనేక ప్రాంతాలలో బౌద్ధ - జైన దేవాలయాలు - వసతులు వెలిశాయి.

కాని - క్రీ.శ. 10-11 శతాబ్దాలలో వీరశైవం దాడి ప్రారంభమైంది. పై రెండు మతాలతో వాదించి - ఎదిరించి - జయించి వీరశైవులు ఆంధ్రదేశంలో తమ స్థానాన్ని పదిలపరచుకున్నారు. ఆనాటి రాజులు - అమాత్యులు - సామంతులు వీరశైవదీక్ష పొందడంతో ఆంధ్రదేశంలో బౌద్ధజైనాల ప్రాభవం తగ్గుముఖంపట్టింది.

మొదటి కాకతిప్రోలరాజు - అతడి కుమారుడు బేతరాజు జైన మతావలంబకులు. కాని రెండవ ప్రోలరాజు శైవ మతాన్ని స్వీకరించాడు. అతడి కాలం నుండి తెలుగు దేశంలో శైవం మూడు పూవులు - ఆరు కాయలుగా వర్ధిల్లింది. రాజాదరణతో పాటు మల్లికార్జున పండితారాధ్యుడు - పాల్కురికి సోమన్న మొదలైన పండితులు, కవులు శైవమత వ్యాప్తికి దోహదం చేశారు.

ఒక వంక జైనం - శైవం తమ అస్తిత్వం కోసం తీవ్రంగా పోరాడుతున్న సమయంలోనే దక్షిణాదినుండి వీరవైష్ణవం తెలుగుదేశంలోకి ప్రవేశించింది. ఈ త్రిముఖపోటీలో జైనం ప్రాముఖ్యతా విశిష్టాగా రంగంలో శైవ వైష్ణవాలు ప్రధాన కక్షిదారులుగా మిగిలాయి.

ఈ రెండూ తమలో తాము పోరాడుకుంటూనే ఉమ్మడిగా బ్రాహ్మణాధిక్యతకు వైదికంతో పోరాటం సాగించాయి. ఈ రెండింటి వల్ల కులాలమధ్య అంతరాలు, మనుషులమధ్య అవాంతరాలు సమసిపోయి సమాజంలో ఒక కొత్త చైతన్యం కలిగింది. అయినా ఈ రెండూ బ్రాహ్మణాధిక్యతను మాత్రం చెరిపివేయలేకపోయాయి. అంతేకాక కాలప్రవాహంలో బ్రాహ్మణాధిక్యతయే వీటి మీద తన ప్రభావాన్ని చూపించింది. ఈకాలంలోని కాకతీయులు - రెడ్లు - వెలమలు వీరశైవ-వీరవైష్ణవ మతాలను స్వీకరించినా తమ బ్రాహ్మణభక్తిని మాత్రం వదులుకోలేదు. బ్రాహ్మణులకు అగ్రహారాలు ఇచ్చారు. సన్మానాలు చేశారు.

తక్కిన విషయాలలో ఎంతో ఉదాత్తులుగా - ఉన్నతులుగా కన్పించే కాకతీయులు మతవిషయంలో మాత్రం జైనులను అణగద్రొక్కడానికి అనేక రకాలుగా హింసామార్గాలను అవలంబించి అప్రతిష్ఠపాలయ్యారు, కాకతిరాజ్య పతనానికి ఈమతద్వేషం కూడా ఒక కారణమైంది.

కాకతీయుల తరువాత మధ్యాంధ్ర దేశాన్ని పాలించిన రెడ్డిరాజులు ముందు ఈ మతద్వేషాన్ని పారద్రోలారు. శ్రీశైలానికి మెట్లు కట్టించిన చేతులతోనే వారు అహోబిలానికి కూడా సోపానాలు నిర్మించారు. తాము శైవులైనా హరికథలను కోరి వ్రాయించుకొని అంకితం పుచ్చుకొని తమ ప్రజలకు ఆదర్శప్రభువులయ్యారు. ఇందువల్లనే సురవరం ప్రతాపరెడ్డిగారు చెప్పినట్లు నాటి ప్రజలు ప్రభుత్వంపట్ల సంపూర్ణవిశ్వాసం - అభిమానం వ్యక్తం చేశారు, 'లేకున్న ఓఢ్ర కర్ణాట మూసల్మాన పద్మనాయకోద్బంధిత దండయాత్రలలో నెగ్గి తెనుగుబాటు చేసియుండును.' (ఆంధ్రుల సాంఘిక చరిత్ర 3వ ప్రకరణము.) వారి మతసహనమే వారి ప్రజలకు - కవులకు ఉపాదేయమైంది. వారి ప్రభుతవ శ్రీరామరక్ష అయింది.

(సశేషం)

# శ్రీ కనకదుర్గానందలహరి.

## శ్రీ శంకర భగవత్పాదకృతము

—శ్రీ చిర్రావూరి శ్రీరామశర్మ

శ్లో. శివసేవాసక్తాంత్రతధరణ
కార్త్రైకచతురే
శిరోభిర్వేదానాం చిర వినుతి
కల్యాణ చరితే
స్మితజ్యోత్స్నాలీలా రుచిర
రుచిమచ్చంద్రవదనే
జగన్మాతర్మాతర్జయకనక
దుర్గే! భగవతి!

శా. వేదాసక్తుల రత్నఁగన్ సలుపఁగా
శ్రీ చాతురీ పూర్ణవై
ఆవేదాగ్రములన్ స్తుతింపబడే
కల్యాణైక చారిత్ర వై
నీ వాచంద్రిక-బోలు నవ్వులను కాంతిం
గూడి చంద్రాస్యవై
సేకల్పొందుము, లోకమాత!
మహితా! శ్రీమాత దుర్గాంబికా! ౧

శ్లో. నగాధీశః కన్యే నలినదళ
సంకాశ నయనే
సుగీతైర్గంధర్వైః స్ఫుర
దుపవతిభిశ్చాను చరితే
అగమ్యైరామ్నాయై రపి
గుణనికాయై ర్విలసితే
జగన్మాతర్మాతర్జయ!
కనకదుర్గే! భగవతి!

మ. హిమవత్పర్వతరాజపుత్రి!
నలిన ప్రోత్కృష్టప్రభా నేత్రవై
అమరస్త్రీజన గీతికాకృత
సపర్యానిత్యసంయుక్తవై
అపలామ్నాయములోగుణోల్లసితవై
ప్రోంచజ్జగన్మాతవై
కమనీయాకృతి శోభతో వరలుమా!
కల్యాణి దుర్గాంబికా! ౩

శ్లో. నిజశ్రేయస్సామైర్నిటల
ఘటితాంచత్కరపుటైః
స్తువద్భిస్సానందం శ్రుతిమధుర
వాచాం విరచనైః।
అసంఖ్యైర్బ్రహ్మాద్యైరమర
సమూహాద్యైః పరివృతే
దయాకర్తవ్యాతేమయి
కనకదుర్గే! భగవతి!

మ. తమకున్ శ్రేయముగాంక్ష చేసి
మదిన్ ధ్యానించి సంతుష్టులై
తమఫాలంబుల దోయిలించి
రసవద్గాఢా కవిత్వంబులన్,
కమలగ్రోద వరదాదిగాగల
సురల్ కాంక్షించి సేవింప, ని
త్యము గోల్వన్ సవిత్రి నాపై
దయనిమ్మా శిస్సు దుర్గాంబికా! ౪

శ్లో. భవత్పాదన్యాసోచిత
కనక పీఠీపరిసరే
పఠంతస్సాష్టాంగం ముదితహృదయా
బ్రహ్మఋషయః।
నివాంఛంతి స్వర్గం నచ ముఖ
సంభూత భవనం
నవామస్తే గర్వం నను కనక దుర్గే!
భగవతి!

మ. జననీ! నీపదయుగ్మముంచనగు
నా సౌవర్ణపీఠంబులన్
ప్రణతుల్ చేయుచు మోదపూర్ణులగు
నాబ్రహ్మర్షి ముఖ్యుల్ మదిన్
గనరున్ గోరరు నాకవాసములు,
నాకంబోద్భవావాసమున్
గనరున్ గోరరు ముక్తిమార్గములతో
కంజాక్షి! దుర్గాంబికా. ౫

శ్లో. శచీస్వాహాదేవీ ప్రముఖ
హరిదీశావ రమణీ
మణీహస్తన్యస్తైర్మణి ఖచిత
పాత్రై రనుదినమ్॥
ససంగీతం నీరాజిత చరణ పంకే
రుహాయుగే।
కృపాపూరం మహ్యందిశ కనక
దుర్గే! భగవతి!

మ. హరిదీశానసతీ మణుల్ శశిమణి
హేమంపు పత్రాలతోన్
వరసంగీత విశేషగానముల నంబా!
హారతుల్ చేయు భా
స్వరకాంత్యుజ్జ్వల శోభనందిన
భవత్పాదాబ్జ యుగ్మంబు నా
కరయం జూపు కృపాకటాక్షములతో
అబ్జాక్షి! దుర్గాంబికా! ౬

శ్లో. ప్రవర్షత్యశ్రాంతం బహుగుణ
మభీష్టార్థనిచయం
స్వరూపధ్యాతౄణాం చిర రని
రయంభంతిన శివే,
అహో మేఘం వర్షం వితరతి
కదాచిజ్జలధరో!
దయాసామ్యం కింస్యాన్నను
కనకదుర్గే భగవతి !

మ. భవదీయంబుల లోపమందలంచు
నీ భక్తాళి వాంఛించు త
త్స్వరరాశిప్రియసంఘము మెల్లపుడు
దాశోభిల్ల వర్షించుగా
అవురా! జలవృష్టి నొక్కతరి
నీ యంగాలు నా మేఘమున్
భవదీయాలక మేఘమున్ సమము
నామా! తల్లి! దుర్గాంబికా! ౭

(సశేషం)

# కుందుర్తి - తెలంగాణ

—డా॥ ఎ. పద్మబాల, M.A , M Phil , Ph.D.,

ఆధునికాంధ్ర కవిత్వంలో భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం అనేవి ఉద్యమాలుగ స్థిరపడి ప్రత్యేకతను సంతరించుకున్నాయి. అభ్యుదయకవిత్వం ప్రచారంలోకి తీసుకొచ్చిన కవితా ఉద్యమం వచనకవితోద్యమం. కావ్యరచనలో ప్రాధాన్యం వహించిన ఛందోబద్ధమైన పద్యకవితకు, భావకవిత్వ కాలం నాటికి బాగా ప్రచారంలోవున్న గేయకవిత్వానికి స్వస్తి చెప్పి అభ్యుదయకవిత్వం వచన కవిత్వాన్ని ప్రచారంలోకి తీసుకొచ్చింది.

వచనకవిత్వానికి వచన పద్యం, వచన గేయం, వచన గీతం, స్వచ్ఛంద కవిత, స్వేచ్ఛాకవిత, ఫ్రీవర్స్ అనేవి పర్యాయ పదాలుగ వ్యాప్తిలో వున్నాయి.

భావకవిత్వం ప్రాభవంతగ్గి, అభ్యుదయ కవిత్వం ప్రారంభంలో వున్నపుడు వచనకవిత్వానికి శ్రీకారం చుట్టబడింది. వచన కవిత్వానికి పితామహుడుగ కుందుర్తిని పేర్కొంటూను తిలక్, దాశరథి, సినారె, ఆరుద్ర, సోమసుందర్, శేషేంద్ర తదితర కవులు వచనకవిత్వాన్ని పరిపుష్టం చేశారు.

వచనకవిత్వ మహోద్యమానికి అనేక విధాల కృషి చేసినవాడు కుందుర్తి ఆంజనేయులు. అటువంటి కుందుర్తి జీవితాన్ని, రచనల్ని ప్రస్తావించడం, అతని రచనల్లోని కథాకావ్యమైన 'తెలంగాణ'ను గురించి పరిచయం చేయడమే ఈ వ్యాస ముఖ్యోద్దేశం.

## కుందుర్తి జీవితం :

ఆధునికాంధ్ర కవిత్వంలో అభ్యుదయ కవి, వచనకవితా పితామహుడు అయిన కుందుర్తి ఆంజనేయులు, గుంటూరుజిల్లా, నరసరావుపేట తాలూకాలోని కోటవారి పాలెంలో నరసమ్మ, కామయ్యలకు 1922 వ సం॥లో డిసెంబర్ 16 తేదీన జన్మించాడు. వీరి పూర్వీకులు కుందుర్తి వాస్తవ్యులు కావడంవల్ల వీరి యింటిపేరు 'కుందుర్తి' అయ్యింది.

కుందుర్తి బాల్యంలో తండ్రి మరణించాడు. అతని బాల్యమంతా తాతగారి ఊరైన వినుకొండలో గడిచింది. కుందుర్తి చదువుకోసం తల్లి నరసమ్మ ధనవంతుల యిళ్ళల్లో పనిచేసి, పాలు అమ్మి సంపాదించేది.

కుందుర్తి వినుకొండలోని బోర్డ్ మిడిల్ హైస్కూల్లో 8వ తరగతివరకు, తొమ్మిదినుండి S.S.L.C. వరకు విజయవాడ మునిసిపల్ హైస్కూల్లోను, ఇంటర్ విజయవాడలోని ఎస్.ఆర్.ఆర్. కాలేజీలోను, బి.ఎ. గుంటూరు ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీలోను చదివాడు.

ఇతనికి సుందరమ్మతో బి.ఎ. చదివే రోజుల్లోనే పెళ్ళైంది. సంతానం ఐదుమంది అమ్మాయిలు, ఒక అబ్బాయి.

కుందుర్తి తొలుత తెనాలితాలూకాలోని దేవేంద్రపాడు నేషనల్ కాలేజీలో 1943 లో ఆంగ్లభాషా బోధకుడిగా చేరాడు 1946 లో గుంటూరు టుబాకో మార్కెటింగ్ కమిటీ ఇన్‌స్పెక్టరుగ, 1956 లో కర్నూల్లో ఇన్‌ఫర్మేషన్ అండ్ పబ్లిక్ రిలేషన్స్‌లో అనువాదకుడిగ, అక్కడనుండి హైదరాబాదు, అక్కడనుండి మహబూబ్‌నగర్‌కు, మళ్ళీ హైదరాబాదుకు డిస్ట్రిక్ట్ పబ్లిక్ రిలేషన్ ఆఫీసరుగ 1966 లో బదిలీ అయ్యాడు. 1977 డిసెంబర్‌లో ఆంధ్రప్రదేశ్ తెలుగు మాసపత్రిక సంపాదకుడిగ పదవీ విరమణ చేశాడు కుందుర్తి. వీరు 1982 అక్టోబర్ 25 న పరమపదించారు.

శ్రీశ్రీ నాయకత్వంలోని అభ్యుదయ రచయితల సంఘంలో కుందుర్తి సభ్యుడిగ వుండి సంఘ అభ్యుదయానికి కృషి చేశాడు. 1966లో కుందుర్తి ఆశయంతో 'ఫ్రీవర్స్ ఫ్రంటు' సంస్థ ఏర్పడింది. ఫ్రీవర్స్ ఫ్రంటు వచన కవితా ప్రచారం కోసం ఏర్పడింది. ఫ్రీవర్స్ ఫ్రంటు తరఫున 'నయాగరా' (కుందుర్తి, రామదాసు, సుబ్రహ్మణ్యంలు కలిసి రాసింది), నగరంలో వాన, నాలో నినాదాలు (కుందుర్తి), వైతరణి (సి.వి. కృష్ణారావు) అనే కవితా సంపుటాలు, 'వచన కవిత' అనే వ్యాస సంకలనం, 'తరంతరం' అనే వివిధ కవుల కవితాసంపుటి ప్రచురితమయ్యాయి.

ఫ్రీవర్స్ ఫ్రంట్ సంస్థ ఏటేటా ఒక ఉత్తమ వచన కవితా సంపుటానికి బహుమతిని తిలక్ సంస్మరణార్థం ప్రకటిస్తూ వచనకవితోద్యమాన్ని ప్రోత్సహిస్తూ వుంది. ఈ సంస్థనుండి, డా॥ ఎన్. గోపి (మైలురాయి), శివారెడ్డి (అమ్మ చెట్టు), శ్రీమన్నారాయణ (వెలుతురు పిట్టలు), ఇస్మాయిల్ (మృత్యువృక్షం), కె. శివారెడ్డి (గ కన్నార్యుడు) మొదలైనవారు బహుమతుల్ని పొందారు.

## కుందుర్తి రచనలు .

కుందుర్తి తన 15వ ఏటనే 'ఆపద్ధారక' శతకాన్ని రాశాడట. 1938 లో జపాన్ వస్తుబహిష్కరణని పురస్కరించుకొని నెహ్రూ విజయవాడ వచ్చినపుడు, కొన్ని పద్యాలు రాసి కుందుర్తి రామమోహనరాయ్ గ్రంథాలయంలో

చదివాడట. రాయప్రోలు 'తృణకంకణం' ప్రేరణతో 1939-40 ప్రాంతంలో 'రసధుని' అనే కావ్యాన్ని తేటగీతుల్లోనూ, 'అమావాస్య' అనే విరహ కావ్యాన్ని వృత్తాల్లోనూ రాశాడు. 'నా ప్రేయసి' అనే ఖండకావ్యాన్ని ఈ కాలంలోనే రాశాడు. 1942 లో 'సౌప్తికం' అనే అశ్వత్థామ అర్థరాత్రి సాహసాన్ని కొనియాడే సుదీర్ఘ కవిత్వాన్ని రాశాడు. అయితే యివన్నీ అలభ్యాలే. సౌప్తికం మాత్రం భారతి ప్రచురితం. ఈ 'సౌప్తికం' విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షం'లోని బాలకాండ ప్రభావంతో సమాస భూయిష్ఠంగా రాయబడ్డదని విమర్శకు గురైంది. జాషువాకూడ కుందుర్తిని మందలించాడట. తర్వాత కుందుర్తి సరళమైన పద్ధతిలో కవిత్వం రాయనారంభించాడు. కుందుర్తి 'నానాసాహెబ్'పై మాత్రాఛందస్సులో గేయాల్ని రాసి, ఏలూరు నవ్యసాహిత్య పరిషత్ వార్షిక సమావేశంలో చదివాడు. 1943 ప్రాంతంలో శ్రీశ్రీ 'మహాప్రస్థానం' చేత ఆకర్షితుడై, అభ్యుదయ రచనలవైపు మళ్లాడు. కుందుర్తి వచన కవితల్ని, వచన కథా కావ్యాల్ని, వచన కవితా నాటికల్ని, పీఠికల్ని, వ్యాసాల్ని, తన జీవిత చరిత్రనీ రాశాడు.

వచన కవితలు :

'నయాగరా' (1944) కొంత వచనంలోనూ, కొంత మాత్రాఛందస్సులోనూ సాగిన రచననిపిస్తోంది. 1956 లో 'తెలంగాణ' సుదీర్ఘ వచనకవిత్వ కావ్యాన్ని, 1958 లో 'ఆశ' అనే వచనకవితా నాటకాన్ని, 'యుగే యుగే' అనేదాన్ని, 1967 లో 'నగరంలో వాన', 'నాలో నినాదాలు' అనేవి ప్రచురితమైనాయి. 1975 లో కుందుర్తి సన్మానసంఘంవారు కుందుర్తి వచనకవితలైన 'దండియాత్ర', 'మాతృగీతం', 'ఇదీ నా దేశం', 'భగవంతునికి బహిరంగలేఖ', 'అనువాదమాల', 'సాహసయాత్ర', 'వేకువ వెలుగులు', 'శిక్ష ఏమిటి' అనే వాటిని 'కుందుర్తి కృతులు'గా ప్రచురించారు. కుందుర్తి మరణానంతరం 1982 లో 'హంస ఎగిరిపోయింది', 1983 లో 'తీరా నేను కాస్తా ఎగిరిపోయాక' అనే వచన కవితా సంపుటాలు ప్రచురితమయ్యాయి.

వచనకథా కావ్యాలు :

తెలంగాణ, దండియాత్ర, సాహసయాత్ర, ఒక అమాద్రికి కావ్యం.

వచనకవితా నాటికలు :

ఆశ, అన్నగారమ్మాయి, శిక్ష ఏమిటి.

అవార్డులు :

'నగరంలోని వాన', 'నాలో నినాదాలు' అనే వాటికి 1969లో సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు లభించింది. 'నగరంలోని వాన'కు 1970 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, 'కుందుర్తి కృతులు'కు 1977 లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు వచ్చాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు ప్రదానోత్సవ సందర్భంలో సభాధ్యక్షులైన [illegible]వారు కుందుర్తిని 'వచనకవితా పితామహుడు' అని ప్రశంసించారు. ఇది కుందుర్తికి బిరుదైంది. 'మేఘమాల' అనే కవితాసంపుటిలో 32 ఖండికలున్నాయి. కుందుర్తి ఒక కవితా సంపుటికి పేరు పెట్టలేదు. ఇందులో, అంతర్జాతీయ బాలల సంవత్సరం, ప్రగతి, నో కామెంట్. వారి మృత్యువు గొప్పేమిటి, మాను[illegible]మూర్ఖులు, నాయకోదాహరణం, ఎక్కడిదా ధ్వని, భవిష్యత్తుకు లేఖ, ముక్తకాలు, ఈ విగ్రహం, ముండి చెట్టు, జాలిమనసు, ఒక గుర్రం కొంటాను, నాకు స్వేచ్ఛ కావాలి, మెల్లో నాలో బిర్య, కవిత్వం వచ్చాక, అష్టాచెమ్మ, రక్తం బావి, కోట చుట్టూ కందకం, ప్రతిపక్షంలో సూర్యుడు, ఒక దోమ వచ్చింది, కాలనివాడు, ఓట్ల జాతర, నన్నెందుకు పిలిచారు, మరుజన్మ, నగిషీలు వంటి 26 ఖండికలున్నాయి. అందులో 18 ఖండికలకు శీర్షికలు లేవు. ఇందులో కొన్ని అనువాదాలుకూడ ఉన్నాయి. అవి సోవియట్ భూమిలో ప్రచురితమైనాయి.

పీఠికలు

వచనకవితా సంపుటాలకు పీఠికలు రాసిన ఘనత ఆధునికుల్లో కుందుర్తికే దక్కుతుంది. ఇతని పీఠికల్ని 'స్పందన సాహితీ సమాఖ్య'వారు 'కుందుర్తి పీఠికలు' అనే గ్రంథంగా 1977లో ముద్రించారు. కుందుర్తి తన వచనకవితా సంపుటాలకు కూడ పీఠికలు రాసుకున్నాడు. 1968 నుండి 1976 వరకు మొత్తం 23 పీఠికలు, 1976 తర్వాత 17 పీఠికలు రాశాడు. 'అమృతం కురిసిన రాత్రి' (తిలక్), 'చైతన్యకేతనం' అనేదానికి, నయాగరా ద్వితీయ ముద్రణకూ, 'తరంతరం', 'మనిషికోసం' మొదలైన వాటికి పీఠికలు కుందుర్తి రాశారు.

వ్యాసాలు :

కుందుర్తి వచనకవితాతత్త్వ నిరూపణ కోసం చాల వ్యాసాల్ని రాశాడు. పత్రికల కోసం, రేడియో ఉపన్యాసాల కోసం ఇతడు వ్యాసాలు రాశాడు. మొత్తం వ్యాసాలు (46 పత్రికలకోసం+8 రేడియోలకోసం) 54.

జీవిత చరిత్ర .

కుందుర్తి తన జీవితచరిత్రను 80 పేజీల వరకు వ్యావహారిక భాషలో రాశాడు

ఇందులో విజయనగరం, గుంటూరు సభల ప్రసక్తి, సమ్యక్కళాపరిషత్తు, పీపుల్స్ ఫ్రంట్ స్థాపన, యుద్ధకాలంలో తన రచనలు, 1978 లో జరిగిన ఆంధ్రోద్యమ ప్రస్తావన వుంది.

కుందుర్తి రచనలు కొన్ని ఆంగ్లంలోకి, హిందీలోకి అనువదింపబడ్డాయి. రాయప్రోలు సంపాదకీయంలో వెలువడిన "ఈస్ట్ అండ్ వెస్ట్ నెం. 4" అనేదానిలో ఒక కవిత, ఎ వరదరాజేశ్వరరావు సంపాదకీయంలో వెలువడిన 'మోడర్న్ ఇండియన్ పొయిట్రీ'లో ఒక కవిత, 'పొయిట్ యాన్ ఇంటర్నేషనల్ మంత్లీ'లో ఎనిమిది కవితలు, వేగుంట మోహనప్రసాద్ సంపాదకీయంలో వెలువడిన 'దిస్ లైవ్స్ సెన్స్'లో మూడు కవితలు అనువదింపబడ్డాయి. కుందుర్తి కవితలు కొన్ని హిందీలోకి అనువదింపబడ్డాయి.

వచనకథా కావ్యం-తెలంగాణ :

కుందుర్తి వచనకవిత్వం కథాప్రాధాన్యం కలదిగ వుండాలని భావించాడు. ఇంకా సినారె, కె. వి. రమణారెడ్డి, సోమసుందర్, సంపత్కుమార తదితరులు కూడ పై అభిప్రాయం గలవారే.

ఆధునికాంధ్ర కవిత్వంలో సినారె ద్వారా గేయకథా కావ్య నిర్మాణం ప్రారంభమైన పిదప, వచనకవిత్వంలో ఆరుద్ర, సోమసుందర్, కుందుర్తి, శీలా వీర్రాజు, రంధి సోమయాజి వంటి ప్రముఖులు కథాకావ్యాల్ని రాశారు. ఆరుద్ర-సినీవాలి, సోమసుందర్-మేఘరంజని, శీలా వీర్రాజు-కొడిగట్టిన సూర్యుడు, అద్దగది, రంధి సోమయాజి-బూర్జువా పెళ్ళికూతురు అనేవి ఇతరుల వచన కథా కావ్యాలు.

కుందుర్తి రాసిన 'దండియాత్ర', 'తెలంగాణ', 'అముద్రిత కావ్యం', 'సాహసయాత్ర' అనే వచన కథా కావ్యాల్లో, 'తెలంగాణ' అనే వచన కథా గేయాన్ని ఈ వ్యాసంలో సమీక్షించడమైంది.

'తెలంగాణ' ఉద్యమ సంబంధమైన కావ్యం. తెలంగాణ ఉద్యమ కాలం నాటి తెలుగు ప్రాంతం తీరుతెన్నుల్ని కుందుర్తి ఈ వచనకథాకావ్యంలో చిత్రించాడు.

తెలంగాణాలో నవాబుకు వ్యతిరేకంగా కార్మికులు, కర్షకులు జరిపిన విప్లవోద్యమాన్ని ఒక సమగ్ర కావ్యంగా రాశాడు కుందుర్తి "ఈ కవి తెలంగాణా విప్లవోద్యమ గాథను భారత గాథగా వ్యంజించి "ప్రస్తావన, సింహాసన, బీజోత్పన్న, సంఘోదయ, ప్రజోద్యమ, రాయబార, బహిష్కార, అజ్ఞాత, మానభంగ, గృహదహన, ప్రతిఘటన, దిగ్విజయ, భూమిదాన, న్యాయదాన, రజాకార, దురాగత, దండయాత్ర, ఉపసంహార అను అష్టాదశపర్వములుగ విభజించి రసవత్తరముగా కావ్యము రచించినాడు" అని డా॥ సినారె గారన్నారు. "ఈ కావ్యంలో ప్రయోగింపబడిన 'సంఘము' కమ్యూనిస్టుపార్టీకి సంకేతము. ఈ పార్టీ ప్రాబల్యములో ప్రజలు జరిపిన ప్రతిఘటనను కుందుర్తి చిత్రించినాడు. ఈ విషయమును కవి స్వయముగ ఒప్పుకున్నాడు" అని సినారెగారు ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు అనే గ్రంథంలో అన్నారు. ఈ విషయానికి సంబంధించి కుందుర్తి రాసిన మాటలు యిలా వున్నాయి :—"చారిత్రక పరిణామంలో మరీ పాతదైపోయిన ఫ్యూడల్ వ్యవస్థమీద ఒక పెద్ద తిరుగుబాటుగా తెలంగాణా ఉద్యమాన్ని నేను భావించాను". ఈ దృక్పథంతోనే కావ్యం మొత్తం నిర్వహింపబడింది. విప్లవోద్యమంలోని వివిధ సంఘటనలకు, కష్టనష్టాలకు, బాధలకు, కన్నీటి గాథలకు, రక్తాన్ని రంగరించే సన్నివేశాలకు కుందుర్తి కావ్యగౌరవాన్ని కలిగించాడు.

కుందుర్తి 18 భాగాల్ని ఏకసూత్రతతో నిర్మించాడు. కుందుర్తి తెలంగాణ కావ్యాన్ని, 1. తెలంగాణా పోరాటం, 2. ప్రజాస్వామ్య వ్యవస్థ స్థాపన, 3. వర్గరహిత సమాజం అనే మూడు ప్రధానాంశాల్ని దృష్టిలో పెట్టుకొని రాశాడని చెప్పవచ్చు.

నిజాం నిరంకుశ పాలనావ్యవస్థను కూకటి వేళ్ళతో పెకలించి దానిస్థానంలో ప్రజాస్వామ్యధ్వజాన్ని ఎగుర వేయాలన్న కాంక్షను "తెలంగాణ" కావ్యంలో కుందుర్తి వ్యక్తం చేశాడు. ఈ ప్రయత్నంలో నిజాంను ప్రజలు ఎదిరించడం, నిజాం కిందవున్న పోలీసులు, రజాకార్లు వంటి వారు ఆగడాలు చేసి తిరుగుబాటును అణిచేందుకు ప్రజల్ని హింసించడం, స్త్రీలను మానభంగం చేయడం, గృహదహనాలు కావించడం యిందులో వర్ణితాలు. చివరకు ప్రజా ఉద్యమంలో రజాకార్లు నిజాం పాలకులు కనుమరుగై, భూస్వామ్య వ్యవస్థ పతనమై ప్రజా ఉద్యమం విజయం సాధించడం ఈ కథాకావ్యంలో పేర్కొనబడింది.

నవాబుపాలనను వ్యతిరేకిస్తూ కుందుర్తి ప్రస్తావనలో యిలా అన్నాడు.

ఒక రాజు మొగాన్నే ప్రొద్దుపొడిచిందా?
దేశంలో
ప్రతి రాజు కటికగుండెలో
పొంగిన అధర్మపుటావేశంలో
పరిపాలన సాగింది'

హైదరాబాదు సంస్థానాన్ని గూర్చి;

'దేశంలోని సంస్థానాలన్నిటిలో
హైదరాబాదు పెద్దది
భూస్వామికం బాధల్ని ప్రజలు
సహించిన
చిట్టచివరి హద్దు అది", (సింహాసన)
'మనదేశం కడుపులో పుట్టిందొక
మహా వ్రణం
ఎప్పుడు మరి దానికి శస్త్రచికిత్సకు
తరుణం'

అని కుందుర్తి అన్నమాటలు, హైదరబాదు సంస్థానపతనాన్ని కోరుతున్నాయని వ్యక్తమౌతుంది.

నిజాం దుశ్చర్యల్ని కుందుర్తి యిలా వివరించారు.

"ఒక రైతు పొలంపోయి యిల్లు
చేరుకునేసరికి
ఏలిన దొరవారి ఘనమైన సేవకులు
వచ్చి
పెళ్ళాన్ని జప్తుచేశారు' (భీకోత్పన్న)
'ఒక కూలివాణ్ణి రెండురోజులు వెట్టికి
దొరగారు ఆజ్ఞాపించారు .
జ్వరం తగిలి చివరిరోజు రాలేదని...
అతడియిల్లు కాల్పించాడు"(భీకోత్పన్న)

ప్రజా ఉద్యమాన్నిగూర్చి కుందుర్తి ఇలా అన్నాడు.

'అడ్డంకులుగా కట్టిన అనకట్టలాపలేవు
వాడావిడిగ పరువెత్తిన ప్రైరింజను
లాగ్పలేవు
ఒక్క మనిషి నిద్రలేచి అక్షమంజిని
లేపుతాడు
ఒక్క అణువు కడుపుపగిలి మహాశక్తి
జనిస్తుంది (భీకోత్పన్న)

నిజాం పరిపాలనలో "ఎంతచేసినా వెట్టిచాకిరీ పొట్ట నిండలేదనీ," 'పండిన గింజలు పన్నుకు"పోయి "పస్తులు" మిగిలాయట. "ఆరు గాలము కష్టపడిన" వారు 'అవురుమని యేడ్చా'రట.

కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాల్ని కవి,
'పశేలు చిరాగ్గో పొలం సెంబర్లు
స్వయంవరం చాటుకున్నై
మావ ప్రవేశం లేదు
సాఘుం నూర్యుడు
సభల ఉపన్యాసాల మధ్యాహ్నాల్లో
మరీ ఎండకాస్తున్నాడు దొరా'
(గాయబారం) అని వివరించాడు.

నాటి పోలీసుల దమనకాండను స్త్రీల దుస్థితిని కుందుర్తి వివరించిన తీరు హృదయ విదారకంగా వుంది. (మానభంగంలో)

"విచ్చలవిడిగా తిరిగే అబోతు,
ఏ చేలో మేసినా ఏమనంమనం"
'పుట్టింటికి పోయిన పెళ్ళాన్ని, మళ్ళీ
కళ్లారా చూసిందాకా నమ్మకంలేదు"
ప్రశ్నల దారాలు లాగుతున్నాడు
పోలీసు అధికారి'
'ఆయువతి', 'కళ్లమీద లాఠీలతో
కొట్టటం మొదలెట్టారు,
పోలీసులు బూట్లతో మొట్టటం
మొదలెట్టారు, ..
'గుడిసెముందు అధికారి యువతిని
చెరిచాడు
పదహారేండ్ల మానవతి శీలాన్నికరిచాడు.
'ఆ అమ్మాయి ఉదయం ఆరుగంటలకు
చచ్చిపోయింది'.

గొల్లా పోరటంలో పతనమౌతున్న బూర్జువావ్యవస్థ స్థితిని కుందుర్తి.

'గ్రామంలో పాతరాజుల ఫర్మానాలు
పలకటంలేదు
మూగబోయిన రాచరికాల గొంతులు
పాడేపాటలకు పదాలు ఉలకటంలేదు
ఆదుకొనేవారు అనుకున్న వారికి
తంతులమీద తరులు' (భూమిదాన)

అని వివరిస్తాడు.

రజాకార్ల పరిస్థితిని,
'రాను రాను మాత్రం గొంతులో ఉండ
మింగుడు పడలేదు.'
'పరుగెత్తలేని రజాకార్లు
ఆ మంటల్లో పడి అసువులు విడిచారు
(రజాకార)
'గాలిమేడలు కూలిపోయినై
ప్రతిఘటన నీటి బుడగలా పగిలింది
రజాకార్లు పరించడానికి యిక
పలాయన మంత్రం ఒక్కటేమిగిలింది'
దండయాత్ర.

భూస్వామ్య పతనాన్ని, ప్రజాస్వామ్య విజయాన్ని కుందుర్తి,

'అడవంతా అల్లకల్లోలంచేసిన
మాత్తగజం లొంగింది
ఒక జాతి ప్రతిష్ఠాపాహిని
గిట్టు తెగించుకు పొంగింది
నవాబు తల నేలకు వంగింది'
(దండయాత్ర) అని పేర్కొన్నాడు.

కుందుర్తి 'తెలంగాణ' కథా కావ్యాన్ని' నిజంజయిస్తుంది, ధర్మంజయిస్తుంది. వెలుగు జయిస్తుంది, తెలుగు జయిస్తుంది' (ఉపసంహార) అని ముగించాడు.

ఈవిధంగా, కుందుర్తి జీవితాన్ని, రచనల్ని, వచన కథాకావ్యమైన తెలంగాణ'ను సమీక్షించడమైనది. కుందుర్తి చిరస్మరణీయుడు'

డా॥ ఎ. పద్మజాల,
17-20/3, కటారి గార్డెన్స్,
రాజమండ్రి.



# జాతీయతా రసగుళికలు - ఆలోచనావీచికలు

—చెప్పెల హరినాథశర్మ, ఎం. ఏ.,

'సుకవితా యద్యస్తి రాజ్యేన కిం' అని భర్తృహరి కాబోలు అన్నాడు. రసవదానంద సందాయకమైన కవిత్వాన్ని ఆస్వాదించినపుడు పాఠకుడు తన పరిసరాల్ని మరచి అలౌకికానందాన్ననుభవిస్తాడు. కవిభావాలతో మమేకమై ప్రపంచాన్ని ఆకళింపు చేసుకుని ఆచరించాలనుకొంటాడు. కవినే ఆదర్శంగా తీసుకుని అనుకరించాలని చూస్తాడు. అందుకే కవికలం సమాజహితాన్ని దేశహితాన్ని కాంక్షించాలని ప్రాచీన కవులు భావించారు. జగద్ధితంబుగోర మహాభారత రచన కుపక్రమించిన నాటి నన్నయనుండి నేటివరకు ఎందరో కవిపండితులు దేశహితం కోసం జాతీయాభ్యుదయపథంలో కవితారససృష్టి గావిస్తూనే ఉన్నారు. ఆ కోవలోనే గళమెత్తి కవితాలాపన చేస్తున్న యువకవి శ్రీకనపర్తి రామచంద్రాచార్యులు.

తమ గుండెగదుల్లో రేగిన భావావేశానికి అక్షరరూపం కల్గించి పాఠకులకుందించిన తొలి కవితాకృతి 'ఆలోచనావీచికలు'. కవి భావనాబలానికి, రససృష్టికి అద్దంపట్టిన ఈ కవితాసంకలనం 1980 లోనే వెలుగుచూసి కవిదేశభక్తికి, జాతీయదృక్పథానికి ప్రతీకయై నిలిచింది. 'జాతి, జీవనానికి చైతన్యాన్ని ముడిపెట్టుకుందాం రండ'ని సాంఘిక శాస్త్రవేత్తలకు పిలుపునిచ్చిన ఈ కావ్యం, ఇరవైనాలుగు కవితా ఖండికలతో కవిప్రతిభకు గీటురాయిగా నిలిచింది.

సమాజం సంఘటిత శక్తిగా ఉన్నన్నాళ్ళూ దానిని ప్రపంచంలోని ఏశక్తీ ఏమీ చేయజాలదు. సమాజంలో సంఘటిత శక్తి లోపించి, అనైక్యత ప్రబలిన ప్రతిసారీ దేశం పరాధీనమైందని చరిత్ర చెప్తోంది. అదిగ్రహించినకనపర్తి 'మనం అనేది ముక్కలై, నువ్వూ - నేనూ'గా మారి వ్యతిరేకదిశలో పయనిస్తున్న'దృశ్యాన్ని చూసి కలతచెందాడు. దానికి కారణం స్వార్థమని గ్రహించాడు.

మనిషి మానవతనుండి
ఒక మెట్టు క్రిందకు దిగజారినపుడు
అహం (స్వార్థం) తనవిశ్వరూపాన్ని
ప్రదర్శిస్తుంది.
నేను-నాది అనే అడకత్తెరలోని
రెండు అంచులమధ్య
నిను నలినలిగా చేస్తుంది
(ఆమెను ప్రేమించకు)

అని హెచ్చరించాడు - సమాజంలోని ఈ అనైక్యతా కులవిభేదాలే మూలకారణమన్న సత్యాన్ని కవిదృఢంగా విశ్వసిస్తున్నట్లు పలుఖండికల్లో కనిపిస్తుంది.

'కులమతాలనే
కులగిరుల
రెక్కల్ని విరగగొట్టే కులిశమది' అని
'నాజాతి జీవగర్ర' అనే కవితలోనూ,
తరతరాలుగా
తాతముత్తాతలంతా
సంధిస్తూ వస్తున్న
వర్ణవిభేదమనే ధనుస్సిది
(ధనుర్భంగం)
సమతా వైదేహిని
నల్గురికీ అంటగట్టడం ఇష్టంలేక
ఏ జనకుడూ
ఈ ధనుర్భంగాన్ని చాటించడంలేదు
(అదేఖండిక)

ఈ కుల విభేదాల నధిగమించడానికి "సమాజంకోసం సమతాహారం తయారు చేస్తున్నామంటారు." జాతి సమానత కోసం నాణ్యమైన భావాలను నగిషీలుగా చెక్కుతాను', అంటారు సమతాహారం అనే ఖండికలో

పశుపక్ష్యాదులకు రక్షణకల్పించడం కోసం స్వసుఖాన్ని పరిత్యజించి, బాధలను ఆనందంగా ఆహ్వానించిన సంస్కృతి మనది. ఆ విషయాన్ని విస్మరించి అపమార్గంలో పయనించడం క్షేమంకరంకాదు, అందుకే

'మాంసానికి మాంసం ఎదురిచ్చి
ఓ చక్రవర్తి కాపాడుకున్న
కపోతాన్ని' గుర్తుచేసి
విధుమండలాన్ని గెలిచినమనం
విద్వేషాల్ని గెలవా'లంటాడు'

పరమాణువును పరిశీలించిన మనం పరమార్థాన్ని వెదకాలంటాడు 'అశాంతి కపోతం' కవితలో.

సమాజంలోని ప్రతికదలికను కళ్ళ మైక్రోస్కోపుక్రింద పరిశోధించి, సృజనాత్మక శక్తిని వెలికితీసే ప్రయత్నం చేసినకవి సమాజముఖకావ్యానికి చైతన్య వ్యాఖ్య రచిస్తాడు టాడీ కావ్యంలో.

'వ్యాయామం బడిలో
అధర్మనమనం
నాగరకత గుస్సుల్లో
అవినీతి విరేచనం'

నేటి సామాజిక దుస్థితిని ఎంత చక్కగా చెప్పాడు. 'ఇది నాజాతికి సోకిన కలరా' అని రోగ నిర్ధారణచేసి, 'అక్షర రూపంలో 'కళ - రా డ్రాప్సు వేసి' నయంచేసే యత్నంచేసాడు. (కలరా గీతం)

'నీ రుగ్మతకు
మందు కాలంలోఉంది'
రమ్మంటూ పిలిచి

జడత్వపు
అంగరఖా విడిచి
అవతలపారేసి
ఇప్పుడువీస్తున్న గాలి
గుండెల్లో కాపీల్చుకో" అంటారు
'చికిత్స' అనే ఖండికలో.

'స్వార్థపరత్వం, పదవీవ్యామోహం అనేవి స్వాతంత్ర్యమనే పాయసాన్ని తాగేసాయంటూ స్వార్థాన్ని సతీతపారి కారణ్యంలా, నిరుద్యోగాన్ని పొడవైన జీవనదిలా అభివర్ణిస్తారు. మనిషి = దేశం అన్నది గురజాడ ఉద్దేశం అయితే మనిషి = ద్వేషం + వేషం, యిదివర్తమానశాస్త్రి నిర్దేశం (కాలసమ్మితం) అన్న వాక్యాల్నిబట్టి కవిహృదయాన్ని పరికిస్తే దేశపరిస్థితి అతన్నెంత ఆవేదనకు గురిచేసిందో అర్థం చేసుకోవచ్చు. యిలాంటి ద్వేషాన్ని వేషాన్ని కళ్ళారా చూశాడుగనుకనే 'సాహిత్యపు పాల సముద్రాన్ని మథించి, అమృతానికి బదులు హాలాహలాన్ని దుష్టగ్రహాలకు పంచుతానంటాడు' ఆవేశంతో (సముద్రమథనం).

దేశం ప్రగతిపథంలో పయనించాలంటే పంటపొలాలు పచ్చగాఉండాలి. విలయతాండవం చేస్తున్న దుర్భిక్షస్థితిని కళ్ళకు కట్టినట్లు వర్ణించారు కవి-

నీటిని ఆవిరి చేసే
సూర్యకిరణాల మాట అటుంచు
నేలకు పచ్చదనాన్నిచ్చే
వర్షపు చినుకు సంగతి ఆలోచించు
(పతనం)

చిక్కిశల్యమైన ఊరిప్రక్క
చెఱువేదో మొరపెట్టుకుందిగాను
నాలుకపై తడియారిన పంటకాల్వ
గుండెపగిలిచస్తున్న దృశ్యాన్ని వర్ణిస్తూ

ఆముద్ర ప్రవేశిస్తానే
అదురా బీజాలను నాటింది
అనుకొన్న ఆశ్లేషలో
ఆశాభంగమే మిగిలింది
చిత్తలో అడుగిడినపాపు
చిత్తకాంతే కరువైంది
(స్వాగతంపలుకలేను)

కర్షకుని ఆవేదన కళ్ళముందుంచుతారు. పుట్టిన గింజెడుపిల్లల్ని పోషించుకోలేని పూరిపాకలో పూరి గుడిసెలో పూలబాలు వసంతాలని ఆకాంక్షిస్తారు.

"చేతులున్నా యంటే చప్పట్లు కొట్టడానికికాదు చేతగానితనపు చెప్పుచేతల నుండి, చైతన్యాన్ని సొంతం చేసుకోవడానికని ప్రకటించిన శ్రీరామచంద్రాచార్యులం కలం అలుపెరుగని అక్షరాల విత్తనాలు. వీరివారిని సమాజపు మెదడు భూముల్లో చైతన్యపు పంటను పండించాలని ఆశిద్దాం.

చెప్పెల హరినాథశర్మ,
P O. మర్పడగ-502 372,
కొండపాక మండలం,
మెదక్ జిల్లా.

.........

# అడిదము సూరకవి - క్త్వార్థేకార సంధి

—శ్రీమతి అడిదము శారద

విజయనగరం జిల్లా శ్రీరాంనగర్‌లో 1990 అక్టోబరు 15, 16 తేదీలలో 'సప్తస్వరాలు' పేరుతో అడిదము సూరకవి రచనపై 'సాహిత్యగోష్ఠి - సమాలోచన సంకలనం'లో సాహిత్యకోవిదులు - పండిత ప్రకాండులు - అవధానిశేఖరులెందరో సునిశిత పరిశీలనతో చక్కని వ్యాసములు రచించి పాఠక లోకానికి అమూల్యకానుకగా అందించారు. ఇది ఎంతయు ముదావహము.

'గడియకు నూరుపద్యములు చెప్పగల దిట్ట, శాపానుగ్రహసమర్థుడు, 'కవితాతత్వంబు సూరకవికే తెలియున్' అని సమకాలికులచేత పేరుపొందినట్టి ఘనుడు, అయిన మన సూరకవి తన "కవిసంశయవిచ్ఛేదము"లో ఒండు రెండు ప్రదేశములలో పడిన ప్రమాదములను అవధానిశేఖరులు.కందుకూరి రామకృష్ణ సూర్యనారాయణ ఎత్తిచూపిరి. అందులో క్త్వార్థేకార సంధి విషయము ఒకటి.

ఇదుగదమ్మునల్యప్పుపై నిత్యసంధి
మాత్ర యొక్కొక్కచోటను
మట్టు మీఱ
కొలువునఘు మడంపు గొరించు శేఖరు
నన్నయట్లు కవిజనాను మతిని'

అని క్త్వార్థేకారసంధిని అంగీకరించినాడు. కాని 'ఒక్కొక్కచోటను' అని గడుసుతనములో చెప్పినాడు. 'క్త్వార్థంబయిన ఇత్తునకు సంధిలేదు' (బా॥వ్యా.), 'క్త్వార్థే నోనథ చేత్సదా' (అ॥శా॥) క్త్వార్థక ఇకారమునకు సంధిరాదని చిన్నయసూరియు, అథర్వణుడు నిషేధించియున్నారు. సూరకవి ఉదాహరించిన పద్యములలో కవిత్రయము వారి పద్యములకు పాఠాంతరములు కలవు.

ఉదా:- 'చాపము నా కందిమ్ముమదుం' అను పాదములో అందిమ్ము అనునది శబ్దపల్లవముగా గ్రహించినచో క్త్వార్థేకార సంధికి అవకాశ ముండదు. ఫలితార్థ మేమనగా ప్రాచీన మహాకవులకు క్త్వార్థకార

సంధి ఇష్టము కాదని అర్వాచీనులు కొందరుపయోగించనను క్త్వార్థకార సంధి సాధువుకాదని చిన్నయసూరి 'న క్త్వః' అని 'శబ్దలక్షణములు' కూడ నిర్ణయించినాడు. క్వచిత్ సవర్ణానాం దృశ్యతే' అని క్వచిత్ శబ్దగ్రహణముతో అహోబలపతి ప్రాచీనుల ప్రయోగములను మాత్రమంగీకరించెనని. కాని ఇందు సూరకవి క్త్వార్థకారసంధిని అంగీకరించుట ప్రమాదమో యనక తప్పదు అని అవధానశేఖరులు ఉటంకించిరి. కాని–

అడిదము రామారావుగారు వ్రాసిన 'అడిదము సూరకవి జీవితము' అనే పుస్తకంలో పదియవ ప్రకరణంలో కవి సంశయ విచ్ఛేదమును గూర్చి వ్రాయుచు ఈ క్త్వార్థకారసంధి విషయమును గూర్చి విపులముగా చర్చించి యుండిరి. అది ఏమన–

ప్రయోగము :–

1. ఇతడు మదీయ పురోహితుం
డితనికిఁ దగ నెల్ల పను లెఱింగించి
పుడే (ఉద్యోగపర్వం)

2. ....... .. .......
జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము
నాకం
దిమ్మనుడు.........(విరాటపర్వం)

3. దర్పించి యాతనికే దగుదునో
తగవో యు
నియించుక సంశయింతు రాత్మ
(నైషధం-శ్రీనాథుడు)

4. నిగి డిగ వైపుల స్వేదల నేటయి
నీటగు ఏటికోట (శుద్ధాంధ్ర
రామాయణము–
అడిదము బాలభాస్కరుడు)

ఇకారసంధి శ్రుతి కటువుగా నుండునని ప్రాచీను లద్దానిని అంగీకరింపరయిరి. అట్లయినను శ్రుతి కటువుకాని ఇకార సంధి దుష్టము కాదనియే వారి యాశయము. "........నా! రా తెలివెందును గలదె" (ఉద్యోగపర్వం 2వ అశ్వాసము 225 పద్యం) అని తిక్కయజ్వ ప్రయోగించి యున్నారు. సామాన్యముగా ఇకారమునకు ఉలవ్యాప్తి పరమగునపుడు సంధి శ్రుతిహితముగానే యుండును. ఇకారసంధి దుష్టమను నిబంధనమునకు అకారాది పరకేకార సంధియే దుష్టమని యెన్నదగును. ఆలోచింపగా క్త్వార్థకార సంధి నిషేధమును తాలవ్యస్వర పరక స్థలముల యందు కాదని మహాకవు లభిప్రాయపడినట్లు స్ఫురించుచున్నది. ఇట్టి భాషాతత్త్వమును కనిపెట్టియు మహాకవుల ప్రయోగ రహస్యముల కనిపెట్టియు దానినే యనుసరించియున్న సహజకవి సూరకవి క్త్వార్థక సంధి విషయమున అట్టి వ్యవస్థ నేర్పరచి శ్రుతిహితములును మహాకవి ప్రయుక్తములును అగు ఇకార పరక క్త్వార్థక సంధులనే యుదాహరించియున్నాడు.

ఉపసంహారం చేసే సమయంలో నాలుగు మాటలు మనవి చేయుదును.

ఒక లాక్షణికుడు నిర్వచించిన సూత్రములను వేరొక లాక్షణికుడు ఖండించడమో లేక తద్విరుద్ధంగా నిర్వచించడమో పండితలోకంలో ఏనాటినుంచో వ్యక్తమయ్యే ఆచారం. ఉదాహరణకు చిన్నయసూరిగారు బా॥వ్యా॥లో అచ్చిక పరిచ్ఛేదం 8వ సూత్రంలో 'కూతు' శబ్దము ప్రథమైక వచనంబునకు రువర్ణంబగు' కూతురు–కూతులు–కూతుర్లు – కూతుళ్ళు – కూతురు నిత్యాది రూపంబులు గ్రామ్యంబులని ఎఱుంగునది అనుశాసనం చేయగా 1836 సం॥లో. అచ్చయిన రావిపాటి గురుమూర్తిగారి వ్యాఖ్యానంలో 147 వ సూ॥లో కూతుశబ్దానికి ప్రథమాబహువచనం కూతుళ్ళు అనే ఉంది. ఇలాంటివి ఎన్నో ఉదాహరణలు చూపించవచ్చును. సూరకవి సామాన్యుడు కాడు ప్రముఖలాక్షణికుడు. ఆయన కవి సంశయ విచ్ఛేదమున గల తద్భవ ప్రకరణము ఆ విషయంలో నేటికి ఏకైక ప్రమాణంగా ఉంది. అందుచేత ఆయన ఇత్వసంధి ఒకొక్కచోట అనగా శ్రవణపేయముగా ఉన్న పరిస్థితుల్లో నిల్చుందని అనుశాసించడానికి అధికారం ఉంది. తన అనుశాసనానికి అనేక ప్రమాణాలు చూపించాడు.

1. ఇతడు మదీయ పురోహితు
డితనికి దగనెల్ల పను లెఱింగించిపుడే
(ఉ॥ ప॥)

2. జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నా
కందిమ్మనుడు (విరాట. ప.)

3. తగుదునో తగవో యని యించుక
సంశయింతు రాత్మ (నైషధం)

4. చింతించు – (ఆముక్తమాల్యద)

5. అడిగిచ్చు – (విజయ విలాసం)

6. నిగిడిగవైపులన్ – (శుద్ధాంధ్రరామాయణము)

7. ఎక్కడ నుండిట వచ్చినారు (కవుల షష్ఠము)

భారతంలో 'ఎఱింగించిపుడె' అనే దానికి పాఠాంతరముందని, "అందిమ్ము" అనేది ధాతుపల్లవమని తీసివేసినను, నైషధము, ఆముక్తమాల్యద, కవులషష్ఠము, శుద్ధాంధ్రరామాయణము, విజయవిలాసము వంటి గ్రంథములందలి ప్రయోగాలు ప్రమాణాలుగా స్వీకరింపక తప్పదు. అందుచేత చిన్నయసూరికంటె పూర్వుడు, సర్వవిధాల ప్రతిభావంతుడు అయిన సూరకవి కవిసంశయ విచ్ఛేదమనే లక్షణ గ్రంథంలో ఇత్వసంధికి సంబంధించి చేసిన నిర్వచనం సర్వులకు శిరసాపరిధార్యమే–

ఈవిషయం ఇలా ఉండగా అనుట, కొనుట అనేరూపాలను బహులంగా అంట, కొంట మొదలగు రూపాలు వాడటం తప్పని అథర్వణుడు, అహోబలపతి అనుశాసించినా ఆముక్తమాల్యద, పారిజాతాపహరణము, కేయూర బాహుచరిత్ర, భారతం ఉద్యోగ పర్వం. భాస్కర రామాయణం వంటి అసంఖ్యాక గ్రంథ ప్రయోగాలు ఉన్నాయి. (చూడు బాలకవి శరణ్యం పుట 51, 57) అహోబలుడూ, అథర్వణుడు నిషేధించినఅంట, కొంట, రూపాలకు తమకావ్యాలలో ఎందరో మహాకవులు సాధుత్వాన్ని కల్పించినట్లే ఈ ఇత్వసంధికి చేమకూర, రాయలు, శ్రీనాథుడు మొదలగువారు తమకావ్యాలలో ప్రయోగమూలంగా సాధుత్వాన్ని కల్పించారు. కవిసంశయ విచ్ఛేదంలో వానినే సూరకవి సూత్రబద్ధం చేసాడు. 'ప్రయోగ శరణం వ్యాకరణం' అనే నానుడి సర్వులకు విదితమే.

'ఆలోచింపక క్త్వార్థకకారసంధి నిషేధము ను దాలవ్యస్వరపరక స్థలముల యందు కాదని మహాకవులభిప్రాయ పడినట్లు తోచుచున్నదని కీర్తికాయులైన పండిత అడిదము రామారావు పంతులు గారు సూరకవి చరిత్ర (181 పుటలో) లో సూచించినట్లు ఇది వరకే మనవి చేసాను. అందుచేత ఇత్వసంధి సాధుత్వ విషయమై సూరకవి కవిసంశయవిచ్ఛేదం లో ఇచ్చిన తీర్పు తిరుగులేనిది.

అడిదము శారద.
ఎ. వి. ఆర్. స్కూలు,
రాజమన్నంగి,
తూ॥గో॥జిల్లా.

(*.*)

# వేదుల మీనాక్షీదేవిగారి "ఫల్గుణీ మహాత్మ్యము"

(ఒక పరిశీలన)

— శ్రీమతి యం. మీనాప్రభాకర్

మనకు క్షేత్రమహాత్మ్యములు ఉన్నవి కాని నదీమహాత్మ్య కావ్యములు తక్కువ. మన పుణ్యక్షేత్రములన్ని పవిత్రములైన నదీతీరములలోనే వెలసినవి కనుక ఆమహాత్మ్యము లందే అక్కడక్కడ నదుల ప్రశస్తి యుగ్గడింపబడినది కాని ఈకావ్యమటుల కాదు.

ఇందు మూడాశ్వాసములున్నది. ఇందలి కథ రామాయణ సంబంధి ఇందు శ్రీరాముడుగాక సీతాదేవి దశరథునికి పిండ ప్రదానము చేయుట, అందునను వాలుకా పిండములు పెట్టుట ముఖ్యేతివృత్తము. గయాక్షేత్రమున ఫల్గుణీ నదికి అవలివైపున ఒక సామాన్యమైన ఆలయమున ఆనాటి దశరథుని చేయి అందు సీతాదేవి యుంచిన వాలుకా పిండములు ఇప్పటికిని ఉన్నవి. ఈ కథాసంగ్రహమిటులున్నది.

దండకారణ్యమందలి పంచవటిలో సీతారాములు సంతోషముగ కాలము వెళ్లబుచ్చుచుండిరి. అంత దశరథుడు గతించి సంవత్సరము గడచి శ్రాద్ధదినము వచ్చెను. దశరథునకు ఏణిమాంసము మిక్కిలి యిష్టము కనుక శ్రాద్ధదినమునాడు రామలక్ష్మణులిద్దరు లేడి వేటకై వెడలిరి.

అది చైత్రమాసము. ప్రకృతి వసంత శోభతో నొప్పుచుండెను. సీతాదేవి ఫల్గుణీతీరమున ఆ శోభను తిలకించుచు నిలువగా నచటికొక నవయువతి స్నానార్థమై వచ్చి తాను తెచ్చిన పసుపు కుంకుమలలో కొంత సీతాదేవికిచ్చి తాను ఆ నదిలో స్నానమాడి అచటనే యొక వృక్షము క్రింద నిలిచెను. అంత సీతాదేవి ఆవిడ యిచ్చిన పసుపు కుంకుమలతో నా నదీమతల్లి నర్చించెను. అప్పుడందుండి యొక తామర మొగ్గ విచ్చుకొన్నటుల కంకణములు, ఉంగరములు గల యొక యంజలి పైకి వచ్చి నిలిచెను. అది చూచి సీత ఆశ్చర్యపడుచుండగా ఒక కంఠస్వరము జానకీ! నేను మీ మామను. దశరథుడను. రామలక్ష్మణులు ధన్యులు. భరతుడు పాదుకలు గొనిపోయి భక్తితో రాజ్యము చేయుచున్నాడు అని తెలుపగా సీత భక్తితో ఆ చేతులకు నమస్కరించెను.

దశరథుడు, భోజనవేళ యైనది నా కాకలి యగుచున్నది కనుక భోజన మిడి నన్ను ధన్యుని చేయుము. భుజించి నేను దివి కేగెదను అనెను. అది విని ఆమె మహారాజా! మీ కుమారులు శ్రాద్ధమున కవసరమైన వస్తుసంభారములు తెచ్చుట కేగినారు. కనుక వారు వచ్చువరకు ఆగుడనగా నతడు నేనంతవరకాగను అని తొందరించెను.

అప్పుడు సీత ఎంతయో కృంగి ప్రాణేశునికై ఎదురుచూచి అతడెంతకును రాకపోవుటచే మనసు దిక్కబట్టుకొని ఆ నదీతీరమందలి యిసుకతో పిండములు చేసి భక్తితో అతని దోసిలిలో నుంచగా నవి పంచభక్ష్యపరమాన్నములుగా మారెను. దశరథుడు "తృప్తోస్మి తృప్తోస్మి" యని వానిని స్వీకరించి అంతర్ధానమయ్యెను.

అపుడు సీతాదేవి ఆ సంభ్రమాశ్చర్యములనుండి తేరుకొనక మునుపే శ్రీరాముడు మృగముతో వచ్చి సీతా! వేటలో ఆలస్యమైనది. నేనిక వెంటనే స్నానమాచరించి వచ్చి శ్రాద్ధకర్మ నొనర్చెద ననగా నామె యిపుడు మీ తండ్రిగారేతెంచినారు. మీరు వచ్చువరకు నిరీక్షించుడని చెప్పినను వినక అపరాహ్ణమయ్యెనని తొందరింప నిచట దొరికిన పదార్థములే నేను వడ్డించితిని. వారవి స్వీకరించి సంతుష్టులై నేగిరని తెలిపెను. సీత మాటలకు రాముడచ్చెరువందె ఎన్నడును యిట్టి సంఘటన కనలేదు కనుక ఓ కాంతా! నీ మాటలు నమ్మశక్యముగట లేదనెను. అపుడామె భర్త తనమాట నమ్మనందుల కెంతయో బాధపడి ఓదేవా! నేను ఎన్నడైన అసత్యమాడితినా! ధర్మపథము తప్పి సంచరించితినా! మీరే దైవమని నమ్మి మీ వెంట వనములకు వచ్చినందులకు ఇదేనా మీరు నాయెడల చూపిన నమ్మకమని ఎంతయో నొచ్చుకొనెను.

ఇక్కడ రచయిత్రి అందరు స్త్రీలకు వలెనే సీతాదేవికి నైతము భర్తృపరీక్షలు తప్పవయ్యెనని లోకరీతిని ప్రకటించి భర్త తన మాటలు నమ్మనపుడు భార్య ఎటుల బాధపడునో ఎంతో సహజముగా చిత్రించెను.

అపుడు శ్రీరాముడు సీత మాటలు విని ఓ సీతా! ఇందుకెవరైన సాక్షులు గలరా యనగా నపుడామె ఫల్గుణీనది ఓ నదీమతల్లీ! నేను నీ పవిత్ర తీరమున నివసించుచున్నాను. నా పతి నా మాట నమ్ముటలేదు. ఈ దశరథాత్మజునితో నీవైన నిజము చెప్పి నా బాధ చల్లార్చుమని వేడగా నా నదీకన్య ఎంతకును పలుకదయ్యెను. అపుడామె దాని తీరమున మేత మేయుచు తిరుగుచున్న గోవును చూచి ఓ తల్లీ! నీవైన జరిగిన నిజమును చెప్పుమనగా ఆ గోమాత నన్ను కాదన్నట్లుగా మొగము నటు త్రిప్పుకొనెను. పిమ్మట సీత అంతవరకు చటికి వచ్చి స్నానముచేసి చెట్టుక్రింద నిలచిన యువతి నడుగగా నామెకూడ ఏదియు మాటాడదయ్యెను. అపుడు సీత మిగుల పరితాపము నొంది ఫల్గుణీనదిని "నీవు తెలిసియు నిజము చెప్పకపోయితివి కనుక ప్రవాహము దప్పి యింకిపోదువుగాక" అనియు, గోమాతను "నీవు నిజము పలుకుటకు మొగము త్రిప్పితివి. కనుక నీ మొగమెవరికి చూడగాదని", వృక్షముక్రింద నిలచిన స్త్రీని "నీవు పాటి స్త్రీయని గూడ చూడక నన్ను నమ్మి చూచిన నిజము చెప్పకపోయితివి. కనుక నీవు (నిత్యాలంకారయుక్తవైనను) అశుచివై నెగడుచుందువుగాక" అని శపించెను.

అపుడా శాపమునకు భయపడి ఫల్గుణీనది వచ్చి ఆమెతో తల్లీ! నేను శ్రీరాముని బాణమునకు వెరచి నిజము చెప్పలేకపోయితిని. నన్ను కనికరించి నా శాపము నుపసంహరింపుమని ప్రార్థించగా నీ ప్రవాహమున నాలుగు నెలలు మాత్రమే నీరుండి మిగిలిన ఎనిమిది నెలలు అంతర్వాహినిగా పారుచుందువుగాక అని ఫల్గుణీనది కొసంగిన శాపమును సవరించెను. అటులే నిజము చెప్పుటకు తలను త్రిప్పుకొని తోకను చూపి ది కనుక గోవును నీ పుచ్ఛమును ముందట వర్జించి అపి... ముగము చూతురని, అట్లే స్త్రీకి నీవు నెలకు మూడు దినములు మాత్రమే యశుచిగా నుందువని తన శాపమును మార్చెను. ఇది ఈ కావ్యమందలి కథావృత్తాంతము.

ముచ్చటైన ఈ మూడాశ్వాసములను హృదయంగమంగా మలచిన ఈ కవయిత్రి చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి మేనకోడలైన రావూరి సుబ్బమ్మగారి కుమారిత. వేమూల రామచంద్రకీర్తిగారి సహధర్మచారిణి. ఈమె చిలకమర్తి వారి మనుమరాలు కనుక ఆ తాతగారి సాహిత్యపు వాసన కొంత వారసత్వముగా అబ్బినదనవలె.

కావ్యాదిని కవయిత్రి తల్లికి, మామగారికి, తాతగారికి అంజలి ఘటించి

సీ॥ కడుగారవము సేయు కన్నతండ్రి గతింప
ప్రేముడిమై నన్నుఁ బెంచె నెవడు;
వ్యాధపరంపరల్ పగబట్టి బాధింప
నుల్లమునన్ దల్లడిల్లె నెవడు;
ఒక పద్దెమో, కతయో వ్రాసి విన్పింప
మోదమ్ముతో మిన్నుముట్టె నెవఁడు;
వేడ్కతో నొక పాట వీణియపైఁ బాడ
వల 'వాణి' వీవంచు నలరె నెవడు;
తే॥ అట్టి కరుణాస్వమందు
నా యనుంగు దాత
కవియు రచయిత, నాటకకర్తయైన
చిలకమర్తి లక్ష్మీనరసింహ కవికి
కేలుమోడిచి నే కృతకృత్యనగుదు

అని పెద్దలయెడ తన వినయమును చాటుకొన్నది. పిమ్మట ఈ కథ రామాయణ సంబంధి కనుక ఆదికవి వాల్మీకికి భక్తితో మ్రొక్కి కావ్యరచన కుపక్రమించినది.

'కవయతీతి కవిః తస్య కర్మ కావ్యం' అని లాక్షణికోక్తి. కనుక దృశ్యమును లోకోత్తరముగా వర్ణించువాడు కవి. ఈ కవయిత్రి కోసలరాజ్యమును వర్ణించుచు అచటి సౌధములు మరియు వాని మెట్లు భగీరథుడు ప్రార్థించగా దివినుండి భువికి దిగిన గంగవలె నున్నవి అని చెప్పినది. సాధారణముగా మేడలను భూమినుండి ఆకాశమునకు గొనిపోవు వప్రస్థలీచుంబి తాంబరములని చెప్పెదరుగాని ఈమె వానిని ఆకాశమునుండియే క్రిందికి దించుకొని వచ్చి తన ప్రత్యేకతను ప్రారంభముననే చాటుకొనినది.

తెలుగు కావ్యములలో ఋతువులది ఒక ప్రత్యేకత. ఒకటియో అరడో ఋతు వర్ణనయుండని కావ్యము లాంధ్ర వాఙ్మయమున మృగ్యమన్న అతిశయోక్తి కాదు.

ఈ కావ్యమున మొదట వసంత ఋతువు వచ్చినది. కవయిత్రి వసంతమును వర్ణించుచు ఆ వసంతములోని కోయిల తానే అయి కూసెను. మల్లె మొల్లల పరిమళములతో ప్రవేశించే మలయమారుతము, చివురుటాకులతో సింగారముగ గనిపించు వృక్షములు, విరబూసిన వేప చిగుళ్ళ చిరుచేదు వాసనలు, ఆ అన్నిటిని తలదన్నే పసిడివన్నె రంగు ఆకసము, నందన వనమా యన్నట్లు వనముయొక్క శోభ యొప్పగా వసంతలక్ష్మి వచ్చినది.

ఈవిధముగా నవనవోన్మేషమైన వాసంతలక్ష్మి చరణమంజీరములకు మాధవుడు తన మానసమునే కానుకగా అర్పించినాడు.

ఆహా! ఏమా సౌందర్యరసానందము. ప్రకృతికి పురుషుడికి మధ్య ఎంతో తీయని దివ్యశృంగారభావనను ప్రదర్శించి కవయిత్రి ఇచట పాఠకుల మానసాన్నే కానుకగా గొన్నది.

కష్టసుఖములు ఒకదానివెంట యొకటి యున్నట్టు వసంతము వెళ్ళగనే వేసవి వచ్చినది. కవయిత్రి యిచట ఉపమానమును లోకవృత్తముగా మలచినది. లోకవృత్తములపైననే గాక వీరికి ఛందోవృత్తములపైన గూడ మక్కువ మిక్కుటమే యనుటకు ఈ పద్యమే తార్కాణము.

సీ॥ చూతకిసాలముల్ సొంపుమై తోరణాల్
మత్తకోకిల గట్టు మంగళముగ;
చంపకోత్పలములు జంటగాచరియించి
మాలలుగా కూర్చు మధువుతోడ;
అభిషేక మొనరించు నలరి మత్తేభముల్
పద్మినీ సురభిళ వారితోడ;
తేనెవాకలమున్గి తేలుచు షట్పదుల్
గానమొనర్చు ఝుంకారములను
తే॥ పంచచామరములు వీచు మనంచితముగ;
నవనవోన్మేష వాసంత నవవధూటి
శ్రీలు(దనరారు చరణమంజీరములకు;
మానసము కానుకై పెట్టును
మాధవుండు

పద్యంలో మత్తకోకిలను అన్నిటివలె కాక ఉత్తరార్థంలో జొప్పించినది కాని అన్నిటివలె పూర్వార్థంలోనే ఉన్న యెడల దీని యొప్పుగడ ఇంకా హృదయంగమముగా నుండెడిదేమో!

ఇక కథాగమనము మామూలే. పై సంరంభమంతయు శ్రీరాముని పట్టాభిషేకమునకు సంబంధించినది. అది చూచి ప్రజలలో సంతోషవీచికలు. అంతలోనే కైక వరాలు దుఃఖవీచికలు. ఒకవైపు దాశరథీ వియోగమూ మరోవైపు దశరథుని హృదయఘోష.

ధీరుడైన తండ్రి దీనుడై కన్పట్ట
కొడుకు లెవ్వరైన కుమిలిపోరె!

అన్న సందర్భోచిత పద్యంలో కవయిత్రిగారు సమకాలీన సమాజమును అద్దంపట్టి చూపించిరి. తండ్రీకొడుకుల మధ్యగల అనురాగానికీ, అభిమానానికీ ఈ వాక్యము కొలబద్ద. తండ్రిగారి దుఃఖాన్ని చూచి రాముడు ఈ పదునాలుగేండ్లు సంతోషంగా క్షణాలవలె గడిపి రాగలనని చెప్పి సీతాలక్ష్మణులు తన వెంట బయలుదేరగా బయలుదేరుతాడు. ఆపుడు రాముడు సీతతో

శా॥ ప్రత్యూషంబున మంగళధ్వనుల
నిద్రన్ వీడి మేల్కాంచునీ
కత్యుగ్రంబగ సింహగర్జనలె సుమ్మా
మేలుకొల్పుల్ వనిన్
అత్యంతంబగు నీతికోవిదలు,మాన్యల్
నాదు మాతల్; నినున్
నిత్యంబున్ కడుప్రేమతో గనెదరో,
నీరేజ పత్రేక్షణా!

అన్న పద్యంలో ప్రతి దినము మంగళధ్వనులతో నిద్రలేచు నీవు సింహగర్జనలతో మేలుకొందువు కనుక నీవు నావెంట రాదగదు. నీతిమంతులైన నా తల్లులు నిన్ను ప్రేమతో చూచెదరు. నీ విచటనే యుండుము అనును.

ఉదాత్త పురుషుడైన ఒక భర్త మనసును కవయిత్రి ఇచట ఎంత ఉన్నతముగా చిత్రించినది.

తానెంత కష్టపడినను ఎన్ని బాధలననుభవించినను పరుల ఇంటి పిల్ల కనుక వనములబడి కష్టముల కోర్వలేదను అతని బాధను చెప్పకనే చెప్పెను.

కవయిత్రి తక్కువ తిన్నదా! రామునికి తగ్గ ఇల్లాలు సీతమ్మ. రాముడెంతటి ఉన్నతమనస్కుడో సీతమ్మగూడ ఉదాత్తమైనదే. అందులోను పతివ్రతా శిరోమణి. అందుకే నాథుడితో

'భర్తతోడిదె లోకమ్ము పడతికెపుడు'

అంటూ సవితతోడ ఛాయాదేవివలె, చందమామతోడ కౌముదివలె, పూవు వెంట తావివలె అతని నీడయై వెంట నంటి నడవులబడి పోయెను.

ఇక్కడ కవయిత్రి భార్యపై ప్రేమగల ఒక భర్తను, భర్తతోడిదె లోకమని నమ్మిన ఒక పతివ్రతా శిరోమణిని చక్కగా చిత్రించినది.

శ్రీరాముడు సీతతోవలెనే లక్ష్మణుని తోడ నీవు తల్లిదండ్రులను సేవిస్తూ తమ్ములకు రక్షగా ఉండుమని, తండ్రికి ఒక పెద్ద కుమారునిగా బాధ్యతల నెరిగిన వాడుగా చెప్పినారు కాని అది విని అతడు అంతఃపురంలోనూ, రాణివాసంలోనూ ఉండేవారు ఎంతైనా సుఖంగానే ఉంటారు. వారిని గురించిన చింత

మనకెందుకు. నేను మాత్రం నిన్ను విడిచి ఒక్క క్షణమైన నిలువలేనంటాడు. ఇక్కడ ఈ అన్నదమ్ముల అనుబంధం లోకోత్తరం.

అయినను పినతల్లి సుమిత్రాదేవి ఆజ్ఞ కానిదే నిన్ను వెంట తీసుకువెళ్ళ లేనంటాడు రామచంద్రుడు. ఇది అతనికి పెద్దల యెడ గల విధేయతకు ఉదాహరణం. అపుడు సుమిత్ర కుమారుని సాగనంపుతూ అన్నా వదినెలను ఏమరుపాటు లేకుండా రక్షించుచుండు మని దీవించి పంపించి, ఆ పిమ్మట కన్నకొడుకు అడవుల పాలైనాడని దుఃఖించు కౌసల్యకు శ్రీరాముని గొప్పదనమును గురించి చెప్పెను. ఇచట రచయిత్రి సుమిత్రను ఒక సుమిత్రగా చక్కగా మలచినది.

తండ్రిమాట నిలబెట్టినానని రాముడు, అన్న వెంట వచ్చినానని లక్ష్మణుడు, భర్తవెంట ఉన్నానని సీత ఈవిధంగా ఎవరికి వారే తమ కర్తవ్యనిష్ఠలో మురిసి పోతారు.

వీరి అరణ్యవాసంలో గ్రీష్మ, వర్ష, శరత్తులు మారుతవి. ఈ వర్ణనలలో పద్యాలన్ని చక్కని, చిక్కని రసగుళికలు.

అత్రి దంపతులకు అంజలి ఘటించిన సీతారాములను వర్ణిస్తున్న ప్రథమాశ్వాసంలోని (ఎనభై ఆరవ పద్యము)

ఉ. క్షోణితలంబు నెన్నుదురు
సోకగ భక్తిని .....
......పుష్పఫలంబు లొసంగి
గెంతియున్

అన్న పద్యము పోతనగారి భాగవత కథా ప్రారంభంలోని ఆరవ పద్యము

ఉ॥ క్షోణితలంబు నెన్నుదురు సోకగ
మ్రొక్కి నుతింతు సైకత
.. పుస్తకరమ్యపాణికిన్
(భాగ. 1-6)

అన్న పద్యమును జ్ఞప్తికి తెచ్చును. అనుకరణలోకూడా ఆనందరసానుభూతి.

ఇక ఇందులో ప్రధానకథ ద్వితీయాశ్వాసంనుండి ప్రారంభమవుతుంది. మును లందరూ ఫల్గుణీనదిని చూడబోతుండగా వారివెంట శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై భక్తుల వెంటనడిచే భగవంతునివలె వెళ్ళినాడు. అపుడు సీత ఫల్గుణీనది వృత్తాంతం చెప్పమని అడుగుతుంది. అపుడు శ్రీరాముడు మునులనోట ఆ కథను సీతకు చెప్పించి దాన్ని ఋషి ప్రోక్తం చేసినాడు. వారు ఆ నదీవృత్తాంతాన్ని

మ॥ లసదుత్తుంగ తరంగ సంకులము,
వేలాపుష్పవాటీరజ
స్త్రసరేణు ప్రకరావగాఢము ఋ
పాసన్; దివ్యసౌగంధముల్
ప్రసరింపన్ నలుదిక్కులందు,
భ్రమర వ్యాపారమే పారగా
వసమింపన్ నది యొందు ఫల్గుణి,
యనన్ పాపపహోద్యమ్ముగా (2-9)

అంటూ కీర్తిస్తారు. ఆ పిమ్మట గయాసురుని వృత్తాంతం ప్రసక్తమవుతుంది. అసలు ఈ ఇతివృత్తంకూడ గయామాహాత్మ్యంనుండియే గ్రహింపబడింది.

ఈ రెండు కథలు అనగా ఫల్గుణీనది, గయాసురి వృత్తాంతం రెండూ కవయిత్రి సీతకు మహర్షులతో చెప్పించుటలో మంచి ఔచిత్యమును ప్రదర్శించినది. వారా వృత్తాంతమును వినుచు ఫల్గుణీతీరమును చేరిరి. ఇక్కడ ఈ సందర్భము యాగరక్షణకు విశ్వామిత్రుని వెంట నేగుచు అతనితో శ్రీరాముడు గంగావతరణము ఘట్టము విన్నరీతిని తలపించును. అటుల ఆ మహాత్మ్యమును వినుచు వారు ఫల్గుణీతీరమున కేగి దాని శోభను చూచి పులకించిరి. అచటనే ఒక పర్ణశాల నిర్మించుకొని మహర్షులను సేవించుచు అందే నిలిచిరి. అంత దశరథుడు గతించి సంవత్సర మగుటచే వారచట నుండగనే అతని పుణ్యతిథి వచ్చెను. ఆ కథ ముందే విదితమైనది.

కావ్యము చిన్నదైనను ఈ కవయిత్రి వర్ణనలు ఎంతో మనోహరముగా నున్నవి. గయా మహాత్మ్యమున గయునికి దర్శన మిచ్చిన విష్ణువుయొక్క ఎదపైగల లక్ష్మి ఘనాఘనమున గల హ్రాదినివలె పోల్చబడినది. లక్ష్మి చంచల, జలముకూడ చంచల స్వభావము గలది. అది మేఘములలో నున్నది. విష్ణువు నీలమేఘశ్యామ వర్ణము వాడు కనుక కవయిత్రి ఈ ఉపమానముతో తన ప్రతిభను చాటుకున్నది.

సీ॥ ఆభోగి భోగ పర్యంక శయానుడై
రవణింప పీతాంబరముతోడ
... ... ...
... ..
క్రమదరహాసమునను సాక్షాత్కరించి
(2-40)

అన్న పద్యము

కస్తూరీ తిలకం లలాట ఫలకే
వక్షస్థలే కౌస్తుభం నాసాగ్రే
నవమౌక్తికం
కరతలే వేణుం కరే కంకణం

అను భగవంతుని దివ్యమంగళ విగ్రహాన్ని కట్టెదుట కళ్లకు కనిపింపజేయును.

గయునిచేత భగవంతుని దివ్యమంగళ స్వరూపాన్ని వర్ణింపజేసిన కవయిత్రి ఎంతో ధన్యురాలు.

ఆ భగవంతుని వర్ణించజాలక ఆది శేషుడే తన వేయి శిరసులు వంచుకొనెనట. ఆ స్వామి విగ్రహం యోగదృష్టికి సైతం అందలేక మునీంద్రులు భయపడినవారైనారట.

ఇంతమందికి అందని స్వామి, బ్రహ్మాది దేవతలు, మునులు తేరిపార జూడలేని

ఆ దివ్యసుందర్శనము రచయిత్రికి కనిపించెను. ఆ భగవంతుని దర్శించగలిగినది కనుకనే మృదుమధురోక్తులతో నిండిన ఈ పద్యములో భగవంతుని చదువరులకు కనుపింపజేసినది.

సీ॥ పసిపాప నవ్వులో పరికించితిని నీదు
ఆనందమయమూర్తి నరసినాను;
సర్వపథంబున కంటు పొగరు నల నీ
గంభీరహృదయమ్ము గాంచినాను;
సంజకెంజాయలో, సరసీ పద్మముల నీ
చిత్రనైపుణిని వీక్షించినాను
పక్షికూజితముల ప్రవహించు ఝరులనీ
గానమాధుర్యంబు గాంచినాను;

తే॥ యోగి పరంధామ! పరమాత్మ!
యోగివినుత!
నేడు ప్రత్యక్షముగ గంటి నిన్ను దేవ!
కన్నులున్న ఫలంబును గంటి శ్రీశ!
తవరి తనువు తపంబును ధన్యమగుచు.

పక్షికూతలో, ప్రవహించు ఝరులలో భగవంతుని గానమాధుర్యము. అన్నీ ఊహాగానాలా! కాదు అవన్నియు గయాసురుని ప్రోల ప్రత్యక్షంగా ప్రదర్శితమయ్యెను.

ఈ వర్ణనలు కవయిత్రి ప్రతిభను చాటుచున్నవి.

ఫల్గుణీనది ఇంకిపోగానే అపుడంగుండి ఒక కంబుకంఠి శైవాలకేశ బయటికి వచ్చినది. ఆమెను గని సీత

ఉ॥ "ఎవ్వతె వీవు భీత శఫరేక్షణ"
... .... వచ్చితి నాతిధేయినై.
(18-119)

అని సంబోధించినది. ఇది మనుచరిత్ర కర్తయైన పెద్దన కావ్యంలో ప్రవరుడు వరూధినిని

"ఎవ్వతెవీవు భీత హరిణేక్షణ" అని ప్రశ్నించిన పద్యానికి అచ్చంగా అనుకరణ. అచట వరూధిని వనంలో కనిపించినది కనుక ఆమె హరిణేక్షణ. ఇచట ఈమె నీళ్ళలోనుంచి కనిపించినది కనుక శఫరేక్షణ. అనుకరణయందు ఔరా! యనిపించినది.

ఇట్టి మెరుపులు ఈ కావ్యమున అడుగు అడుగున ప్రదర్శింపబడినవి.

పాఠకులను తన కవితావాహినిలో ముంచి ఈ కావ్యమున వారికి ఉత్తర భారత మొంతటి కనువిందు కట్టించి గయా దర్శనము చేయించి ఫల్గుణీనది ప్రవాహమున ఓలలాడించిన ఈ కవయిత్రి ధన్యురాలు.

— ధన్యోస్మి —

యం. మీనాప్రభాకర్,
పాలెం.

---

## పూదండ చాటున

—శ్రీ ధూర్జటి వేంకటబాలాజి

మబ్బులుపిండిన ఆకాశంవైపు చూడకు!
అవి ఏక్షణంలోనైనా వర్షిస్తాయి!
తలవంచుకొన్న చెట్లను చూడకు!
శోకంతో-
రోదించి రోదించి తలవంచుకొన్నాయి!
విరుపేపలకు-
పంటివిగువున సాగేజనాన్ని-
పిలచి మాట్లాడబోకు!
కమ్మని పిలుపుకు కిరువై
వెనుదుగు వేస్తున్నారు!
రోడ్లలో-
పలుగురు కలిసినచోట-
నగరాలలో-
వీధులలో-
నిర్మానుష్యమైన జన జీవనంలేని
ప్రాంతాల్లో-
విమానాశ్రయాంలో-
రైళ్ళల్లో -
ట్రాముల్లో-
బస్సుల్లో-
చెట్టుక్రింద పిచ్చాళ్ళు కూర్చున్న
చోట్లల్లో-
నదులలో-
సముద్రాలలో-
హోరెత్తేగాలులలో-
మనిషికి మనిషికి మధ్య-
అంతరంగాన్ని అర్థం చేసుకోలేని
లోదేశ్ళమధ్య-
కటబద్ధలు కొట్టుకున్నా-
తలపండిన మేధావులకు కూడా
అర్థంకాని-
అంశం ఒక్కటే ఒక్కటి-
పరిమళాన్ని వెదజల్లే-
పూదండలు మృత్యువును కూడా
ప్రసాదిస్తాయా అని

ధూర్జటి వేంకటబాలాజి
తెలుగు లెక్చరర్
10-38-8 B, టీచర్స్ కాలనీ
జనతాపేట ఫస్ట్ లైన్
కావలి-524 201

(000)

---

